# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక

## సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు

గౌరవ సహాయ సంపాదకులు:

టి.ఎల్.ఎన్.రావు

వి.బాలకుమార్

సభ్యులు:

కె.వి.ఎస్.గోవిందరావు

కె.వి.ఎస్.శరత్ బాబు

కె.వి.ఎస్.విజయకుమార్

కె.రత్నకుమారి

## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (సంవత్సరం) | 45.00 |

విస్డమ్

[illegible]

మద్రాసు-600004


# ఈ సంచికలో

నవంబరు 1985


| | |
|---|---|
| ధ్యానం, సంపాదకుని పేజీ | 2 |
| సమాజసేవ | 4 |
| ఇందిరాగాంధీ | 7 |
| అరబిందో ఘోష్ | 9 |
| స్నేహాన్ని సంరక్షించుకోవాలి | 13 |
| ముక్కు ముచ్చట్లు | 14 |
| పక్షుల అద్భుత యాత్ర | 17 |
| పిసీ ప్రపంచం | 21 |
| పునర్జన్మ - నిజామా లేక కథా? | 22 |
| మా తెలుగు తల్లికి మల్లె పూదండ | 25 |
| భయానికి ముఖ్య కారణం | 26 |
| ఆదిగ్రంథ్ అవతరణ | 30 |
| బాల్‌పాయింట్ పెన్ | 31 |
| మీరు సమర్థులేనా? | 34 |
| పువ్వుల రాణి - రోజా | 37 |
| ఆంగ్లేయ నిఘంటువు | 40 |
| మర్యాదను నిలబెట్టుకోవాలంటే | 41 |
| జి.డి. బిర్లా విజయానికి రహస్యం | 45 |
| బహుమతి పొందిన వ్యాసం | 46 |
| ఔషధ ప్రపంచం | 52 |
| మిక్కిలి పెద్ద పర్వత శ్రేణి | 54 |
| పోటీలు | 59 |
| పోటీలు (ఫలితాలు) | 63 |




ముఖచిత్రం

సత్యభామ నరకాసురిని వధించుట

**తెలుగు విస్డమ్‌కు ఇది నాల్గవ సంవత్సరం**

# ధ్యానం

## సహజమైన మానవుడు



జేమ్స్ ఎలెన్

మానవుడు ఎడతెరిపి లేకుండా పాప కర్మలనే ఆచరిస్తూ పాప ఫలితాలనే అనుభవిస్తూ పాప పరిధిలో ప్రాకులాడుతూ తానొక పాపాత్ముడై పోయాడని స్వర్గం, స్వర్గంలో ఆనందం తనకు అందుబాటులో లేవని దివ్య ప్రేమ తనకు దూరమైపోయిందని విచారిస్తాడు. సహజంగా మానవుడు ఆధ్యాత్మిక జీవి. నిత్య జ్యోతిగా ప్రకాశించే అనంత సత్యానికి చెందినవాడు. ఈ పరమ సత్యమే పరమోత్కృష్టమైన భగవత్స్వరూపం. ఇదే నిష్కళంకమైన పరిపూర్ణ స్వరూపం. వివేక

(మిగతా 6 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## పొరపాట్లకు మూలం అజ్ఞానం

విందు భోజనాలు అయిన తరువాత ఇష్టాగోష్ఠికి ఆహ్వానించారు. మిడిమిడి జ్ఞానం గల ఒక సాధ్వీమణి:

"నా కడుపు నిండిపోయింది. బలవంతం చేయవద్దు. నేను ఇంక తినలేను" అంది.

మిడి మిడి జ్ఞానం ఎప్పుడూ అపాయకరం. ఒకరు తనకు తెలియని విషయం తెలియదని చెప్పుకుని తెలుసుకోడానికి ప్రయత్నం చేయడం ఉత్తమం. తెలియని దానిని తెలిసినట్టుగా నటించడం కంటే, తెలియని విషయాలను అడిగి తెలుసుకోడానికి, చదివి తెలుసుకోడానికి నామోషీ పడకూడదు; సిగ్గు చెందకూడదు.

మనకు అన్ని విషయాలు తెలిసి ఉండాలని లేదు. మనకు తెలియని విషయాలు ఎన్నో ఉంటాయి. ఆ మధ్య అప్పుడే పెళ్ళి అయి అత్తగారింటికి వచ్చిన ఒక అమ్మాయి ఒక షాపుకు వెళ్ళింది. నాలుగు కిలోలు పౌడర్ లైట్ సుగర్, కండెన్స్డ్ మిల్క్ డబ్బాలు రెండు, డెసిక్రేటెడ్ రెడ్ ఫిష్ 1 పౌండ్ కట్టమంది. షావుకారుకు నవ్వు వచ్చింది నవ్వు ఆపుకుని అన్నీ వ్రాసుకుని "అంతేనా అమ్మా, క్రొత్తగా వచ్చింది హార్స్ రాడిష్

---

"కలియుగమున సత్యనిష్ఠయే తపస్సు,
సత్యవ్రతమే ముఖ్యమైన వ్రతము."

కట్టమన్నారా?" అన్నాడు. "మాకు అక్కర్లేదు. మాకు గుర్రంలేదు" అంది.




కొద్దిగా తెలిసినా, ఏమీ తెలియకపోయినా అంతా తెలిసినట్టుగా నటించవద్దు. పూర్వం గ్రీకు దేశంలో డెల్ఫిక్ ఆరకల్ 'సోక్రటీస్ ప్రపంచంలో గొప్ప మేధావి, వివేకవంతుడు' అని చెప్పినప్పుడు, అంతటి సుప్రసిద్ధ తత్త్వవేత్త తనకు ఏమీ తెలియదని తెలుసుకోగలిగాను అని అన్నాడు.

పొరపాట్లకు మూలకారణం అజ్ఞానం. మంచి వెలుతురులో గానీ, లేక చక్కని కాంతిలోగానీ మనకు వస్తువిజ్ఞానం కలుగుతుంది. అధ్యయనం వల్ల బుద్ధి నైతికంగా, ధార్మికంగా అభివృద్ధిని పొందుతుంది జ్ఞానం ప్రకాశిస్తుంది. అధ్యయన దీక్షతో జ్ఞానాభివృద్ధి కల్గించుకోని మనస్సు సంక్షోభంతో అల్లకల్లోలంగా, అయోమయంగా ఉంటుంది.

విద్యతోబాటు తమ పిల్లలకు మంచి నడవడిని, విజ్ఞానాభివృద్ధిని కలిగించే తల్లిదండ్రులు ఎంతో ధన్యులు. తన తండ్రి ఫిలిప్ కంటే తనకు జ్ఞానభిక్ష పెట్టిన అరిస్టాటిల్‌కు తానెంతో ఋణపడి ఉన్నట్లు మాసిడోనియా చక్రవర్తి అలెగ్జాండరు చెప్పుకొనేవాడు.

ఇళ్ళు, వాకిళ్ళు, ఆస్తులు, అంతస్తులు కంటే మనస్సుకు ఆహ్లాదకరమైనది విజ్ఞానం. "విజ్ఞానం మానసిక శక్తికి మూలం" అని, అన్ని కష్టాలకు మూలకారణం 'ధనం' అని లార్డ్ బేకన్ అన్నాడు.

అనేకమంది విద్యార్థులు డిగ్రీలకోసం, డాక్టరేట్లకోసం కాలేజీలకు, విశ్వ విద్యాలయాలకు తిరుగుతూంటారు. సంపాదించుకున్న విజ్ఞానాన్ని సక్రమంగా ఉపయోగించుకోరు. వందమందిలో ఏ ఒక్కరో మాత్రమే చదివిన చదువులను విజ్ఞానదాయకంగా వినియోగించుకుంటారు. ●

## విస్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83, మార్చి '83; ఫిబ్రవరి '84 నుంచీ డిసెంబరు '84; జనవరి '85 నుంచీ మే '85 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీల వెల రూ. 1.75 లు, 1984 కాపీల వెల రూ. 13.00 లు; 1985 కాపీల వెల రూ. 6.25 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 2.75 చేర్చి M. O. పంపాలి. 'విస్డమ్' 9, దేశికారోడ్డు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్.

"హృదయము శుద్ధమైననేగాని భగవంతుడున్నాడను విశ్వాసము కూడా కలుగజాలదు."

# సమాజసేవ

పి. చంప



[కుమారి పి. చంప మద్రాసు పట్టాభిరామ్‌లో రావుబహదూర్ కలవల కన్నన్ చెట్టి హిందూ కాలేజిలో చదివిన విద్యార్థి 1978-79 లో ఈమె 'బెస్టు ఆర్గనైజర్' పతకాన్ని గెలుచుకుంది.]

కొంతమంది వ్యక్తులు అతి శీఘ్రంగా ఆలోచనలు చేస్తారు. వారికి జ్ఞాపకశక్తి కూడా చాలా అమోఘంగా ఉంటుంది. చూసిన విషయాలను ముక్తసరిగా ఏ విధమైన పొరపాట్లు లేకుండా వివరిస్తారు. అటువంటివారు అతి చాకచక్యంగా, నైపుణ్యంగా, వేగంగా పనులను నిర్వహిస్తారు.

ఇటువంటివాళ్ళు ఎవరు అని మీరు ఆశ్చర్యపడిపోవద్దు మీరు కూడా అలా ఉండాలనుకుంటే సమాజసేవ చేపట్టండి. ఒక సమాజ సేవకులుగా, సంఘ సేవకులుగా మీలో ఏర్పడే మార్పులు ఒక్కసారి గమనించుకోండి. మీకు ఒక అంతస్తు ఏర్పడుతుంది. మీరు సమాజ సేవకులుగా బాధ్యత వహించవలసి వస్తుంది. 'మనో నిశ్చయం' ఏర్పడుతుంది. పరిసర వాతా

## మీరైతే...?

(సెప్టెంబరు 1985)

(పరిశ్రమలు కంప్యూటర్ల మయమైతే?)

"లేబర్ మినిస్టర్‌గా కూడా
కంప్యూటర్నే నియమించమని సలహా ఇస్తా."

—డి. చలపతిరావు, రంగరాయిపేట,
(వరంగల్ జిల్లా)

* * *

"నన్ను ఏమి చేయమంటుందో కంప్యూటర్‌ను అడుగుతాను."

—ఏ. గీతాంజలి, మచిలీపట్నం.

* * *

"వారానికి రెండ్రోజుల పని కిక
ఆందోళన లేవదీస్తా!"

—తమిడిపాటి పద్మజ, నరసన్నపేట,
(శ్రీకాకుళం జిల్లా)

"ఉన్నతికి మూల మంత్రం ఆత్మసమర్పణం, ఉన్నతికి అర్థం ఆత్మజ్ఞానం."

వరణ మార్పులతో మీ వ్యక్తిత్వమే పూర్తిగా పరిణామం చెందుతుంది.

మనోజ్ఞమైన భావాలను అభివృద్ధి



చేసుకోడం తెలుసుకోవాలి. మీ కంటే తక్కువవారిని, అదృష్ట హీనులను కలుసుకున్నప్పుడు వారి జీవిత పరిస్థితులను తెలుసుకోవాలి. వారి మంచి చెడ్డలను విచారించాలి. వెంటనే జీవితంలో మీ కంతవరకు పరిచయం కానటువంటి ఒక నూతన అనుభవం కలుగుతుంది. మీ కంటే అన్ని విషయాలలోను తక్కువవారితో మెలగుచున్నప్పుడు వారిమీద మీకు దైన్యభావం ఏర్పడుతుంది దానివల్ల మనోజ్ఞమైన సున్నిత భావాలు మీలో ఉద్భవిస్తాయి. అనురాగం, ప్రేమ, సౌహార్ద్రత, సహకారం, సానుభూతి మొదలైన సున్నిత భావాలు మనస్సులో ఉప్పొంగుతాయి. ఒక విధమైన ఆనందానుభూతిని అనుభవిస్తారు. సామాజికంగా ఆసక్తులు కావాలి సంభాషించేటప్పుడు మీ వైఖరి, మాటతీరు, అంగవిక్షేపం, అలవాట్లు, విజ్ఞానాలను బట్టి ఇతరులకు మీ మీద అభిప్రాయం ఏర్పడుతుంది. సమాజంలో వివిధ అనుభవాలతో, వివిధ విజ్ఞాన సామర్థ్యాలతో ఉండే వ్యక్తులతో మీరు వ్యవహరించాలి. మీలో ఉండే ఏ ఏ గుణాలు, ఏ ఏ లక్షణాలు వారికి ప్రీతికరంగా ఉంటాయో తెలుసుకోవాలి. ఈ విధంగా మీరు తెలుసుకున్నప్పుడు విరసంగా కాకుండా సరసంగా ప్రవర్తించ గలుగుతారు.

మీ స్నేహితుల పరిధిని మరింత విస్తృతం చేసుకోవాలి. విజ్ఞానవంతుల సహవాసంతో మీరు అన్యోన్యంగా ఉంటూంటే మీ సాంఘిక నైపుణ్యాలు పెరుగుతాయి. వృత్తి యొక్క పరువు, ప్రతిష్ఠలను గ్రహించాలి వీధి శుభ్రంగా ఊడ్చడానికి నామోషి పడవద్దు సమాజసేవ శిబిరాలకు వెళ్ళినప్పుడు వీధిలో చెత్త ఊడ్చి కుప్పతొట్టెలో వేయండి. మర్యాద తగ్గిపోదు. మొట్టమొదట ఇటువంటి పనులు చాలా అసహ్యంగానే కనిపించవచ్చు కాని మీ పని సక్రమ మార్గంలో చేయవలసిన రీతిలో

## ఫుట్‌బాల్ ఆట చట్ట విరుద్ధం!

ఒకప్పుడు ఇంగ్లండులో ఫుట్‌బాల్ ఆడటం చట్ట విరుద్ధం. ఇంగ్లండ్ చక్రవర్తి ఎడ్వర్డ్ III జూన్ 12, 1349లో హాండ్ బాల్, ఫుట్‌బాల్ ఆడటం చట్టవిరుద్ధమని ప్రకటించి విలువిద్యను ప్రోత్సహించాడు. అతడు మరణించే దాకా ఇంగ్లండ్‌లో ఫుట్‌బాల్ ఆడటం చట్టవిరుద్ధంగానే ఉండేది.

"మంచి చెట్టు విషఫలము నీయదు. విషవృక్షము మంచిఫలము నీయదు."

విష్కపటంగా, త్రికరణశుద్ధిగా చేస్తే అందులో ఒక దివ్యానందం పొందుతారు. అది సున్నితమైన అనుభవం!



వ్యక్తిత్వంలో ధనభావాన్ని పొందాలి. దివ్య స్పృహతో ఆత్మచైతన్యం ఉద్భవిస్తుంది. జీవితంలో ఎంతటి కష్టాలనైనా సులభంగా ఎదుర్కోగలుగుతారు. ఉన్నతాశయాలతో జీవితంలో ఔన్నత్యాన్ని సాధించడానికి ప్రయత్నించండి. మీ ఉద్యమాలు విజయవంతంగా కొనసాగిపోతాయి. సమాజసేవ ఆదర్శ జీవితానికి, సాహసానికి అనేక అవకాశాలు కల్పిస్తుంది. కాబట్టి మీరు మరింత వివేకవంతులుగా, విజ్ఞానవంతులుగా మానసిక స్థైర్యంతో ప్రవర్తించగలుగుతారు.

నాయక లక్షణాలను పెంపొందించుకోవాలి. ఈ సందర్భంలో సమాజసేవ అనేది సమాజంలో ఇతరులతో చేరి కలిపి మెలిసి ఉండటం ఆపేక్షిస్తుంది. సంఘభావాన్ని అభివృద్ధి చేసుకోవాలి. అప్పుడు మీరు ఇతరులను మీ వైపు మళ్ళించుకోగలుగుతారు. మీరు ఇతరులచేత చేయించదలచుకునే పని సులభంగా చేయించగలుగుతారు. మీరు ఎప్పుడూ ఇతరులతో కలిసి మెలగవలసి వస్తుంది కాబట్టి, మీరు 'ఆదేశ సిద్ధాంతం' (Drive theory) అలవాటు చేసుకోవాలి. అంటే ఏ ప్రేరణ శక్తి వల్ల ఇతరులు ఆ యా కార్యాలను చేయగలుగుతున్నారో మీకు తెలుస్తుంది.

ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. జీవితంలో విజయవంతంగా ఉండాలంటే సహజమైన వివేకం, ఉత్తేజం, మదింపు, మెప్పుదల ఉండాలి. ఇద్దరు వ్యక్తులను పరిశీలిద్దాం. ఇందులో ఒకరు మరొకరి కంటె ఎక్కువ జ్ఞానసంపన్నులుగా ఉండవచ్చు. ఎక్కువ జ్ఞానసంపన్నతగల వ్యక్తి తనకు లభించిన అవకాశాన్ని బాగా వినియోగించుకో గలుగుతారు. ఇటువంటి వ్యక్తులు సమాజసేవకు సంబంధించిన ఉద్యమాలలో సామర్థ్యవంతంగా పాల్గొన గలుగుతారు.

సమాజ సేవకు పూనుకున్న వ్యక్తి ఇతరుల లాభం కోసం చేస్తున్నప్పటికీ స్వలాభాన్ని కూడా పొంద గలుగుతున్నాడు. "వాస్తవంగా శౌర్యంతో ఉద్యమిస్తే సాధించలేనిది ఏదీ లేదు" ●

---

(2 వ పేజీ తరువాయి)

యుక్తమైన మనస్సుతో జ్ఞానేంద్రియాలన్నిటినీ అదుపులో ఉంచుకుని కర్మేంద్రియాలతో చేయవలసిన కర్మలను ధర్మయుక్తంగా చేసే మానవుడు చిత్తశుద్ధిని పొందుతున్నాడు అట్టి మానవుని హృదయం నిష్కలంకమై తేజోవంతమై ప్రకాశిస్తుంది. అట్టి మానవుడే సహజ మానవుడు. ●

"జీవించి యున్నన్నాళ్ళు నేర్చుకొనుచునే ఉందుము."

# భారతీయ మనీషులు

## ఇందిరాగాంధీ

గత సంవత్సరం అక్టోబరు మాసంలో సర్వ జనాభిమాన పాత్రురాలు, కారణజన్మురాలు అయిన శ్రీమతి ఇందిరాగాంధీ హత్య దేశంలో వివిధ రాజ్యాధికారులను, వివిధ



దేశాల ప్రభుత్వాధినేతలను ఒక్కసారి చలింపచేసింది. అగ్రనాయికరాలుగా పరిగణింపబడిన ఈమె అసమాన ధైర్య సాహసాలను ప్రపంచం అంతా మెచ్చి భారత దేశపు 'ఉక్కు వనిత' (Iron woman) అని గౌరవించారు. దేశాభ్యుదయానికి అంకితమై ప్రజాప్రగతికి శక్తివంచన లేకుండా పాటుపడిన ఈమెను భారతమాతగా పూజించి గౌరవించారు.

ఉత్తరప్రదేశ్ అలహాబాదులో నవంబరు 19, 1917న జన్మించిన ఈమె తండ్రి భారత దేశపు తొలి ప్రధాన మంత్రి జవహర్‌లాల్

## భావపరిచయ పోటీ

(సెప్టెంబరు 1985)

"విమర్శలకు కుంగవద్దు,
పొగడ్తకు పొంగవద్దు"
—ఆర్. పురుషోత్తం, కలకోట,
(ఖమ్మం జిల్లా)

• • •

"పిర్యాదులు పెంచలేవు పని నాణ్యత,
విమర్శక ప్రోత్సాహం అవశ్యకత"
—బి. జనార్ధనరావు, అమలాపురం.

• • •

"విమర్శలకు లేదు ఒప్పు,
ప్రశంశలకే మరి మెప్పు."
—శ్రీమతి శారదామోహన్, కాకినాడ.

"ఆధ్యాత్మిక సాధనవల్ల, ఆత్మసంయమము వల్ల
సిద్ధులు వాటంతట అవే కలుగుచుండును."

నెహ్రూ. తల్లి కమలానెహ్రూ. తలిదండ్రులు ఈమెకు 'ఇందిరా ప్రియదర్శిని' అని పేరు పెట్టారు. ఈమె స్విట్జర్లాండ్‌లోను, ఆక్స్‌ఫర్డ్ (ఇంగ్లండు) సోమర్ విల్లీ కాలేజిలోను, భారతదేశంలో పశ్చిమ బెంగాల్‌లో విశ్వ భారతి శాంతినికేతన్‌లోను, బొంబాయి దగ్గర పూనాలోను విద్యను అభ్యసించింది.

## నవంబరు 19 శ్రీమతి ఇందిరాగాంధీ జన్మ దినం

స్వాతంత్ర్య పోరాటంలో భారత జాతీయ కాంగ్రెస్‌కు సహాయ నిరాకరణోద్యమాలలో సహకరించడానికి ఈమె చిన్నతనంలోనే రాజకీయాలలో చేరి బాల చర్ఖా సంఘాన్ని, 1930 వ సం. లో 'వానరసేన'ను స్థాపించింది ఇందిరా ప్రియదర్శినికి మార్చి 26, 1942 న ఫెరోజ్ గాంధీతో వివాహం జరిగింది సెప్టెంబరు 1942 లో వీరిద్దరు సహాయ నిరాకరణోద్యమాలలో పాల్గొన్నారనే నేరారోపణతో శిక్షింపబడి చెరసాల యందు ఉంచబడ్డారు. తండ్రి, ఇతర బంధువుల సహాయంతో ఈమెకు గొప్ప గొప్ప నాయకుల పరిచయ భాగ్యం లభించింది జాతిపిత అయిన మహాత్మాగాంధీ ఆశయాలవల్ల ప్రబోధితురాలై ఈమె 1947 వ సం.లో ఢిల్లీలో అశాంతి ప్రబలిన ప్రాంతంలో ఉద్యమాలను ప్రారంభించింది.

ఇందిరా ఫెరోజ్ దంపతులకు రాజీవ్, సంజయ్ అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వీరిలో సంజయ్ న్యూఢిల్లీలో విమాన ప్రమాదంలో మరణించాడు. రాజీవ్ ఇప్పుడు భారత దేశపు ప్రధాన మంత్రి పదవిని అధిష్టించాడు.

1947 వ సం. లో భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఇందిరా గాంధీ తండ్రి జవహర్‌లాల్ నెహ్రూకు చేదోడు వాదోడుగా సహకరిస్తూ ఒక్క భారత దేశంలోనే గాక విదేశాలలోను తండ్రితో కూడా ఉంటూ రాజ్యపాలనా నైపుణ్యాన్ని, రాజ్యతంత్ర్యాన్నీ నేర్చుకుంది. 1955 వ సం.రం నుండి వాసవంగా భారత జాతీయ కాంగ్రెస్ సంస్థతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకుని 1959-60 సంవత్సరంలో ఆ సంస్థకు అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది.

1964 వ సం. లో లాల్‌బహదూర్ శాస్త్రి నాయకత్వాన ఆనాటి మంత్రివర్గంలో ఈమె ఇన్‌ఫర్‌మేషన్ అండ్ బ్రాడ్ కాస్టింగ్ మంత్రిగా నియమింపబడింది. శాస్త్రి అకస్మాత్తుగా తాష్కెంట్ (రష్యా) లో మరణించినప్పుడు 1966 సం. లో ఈమె ప్రధాన

(మిగతా 57 వ పేజీలో)

## పాములకు చెవులు లేవు



పాములకు చెవులు లేవు. పాములు మాటి మాటికి నాలుకను ముందుకు జాపి శబ్ద తరంగాలను గ్రహిస్తాయి.

"ఒకసారి హృదయ పరిశుద్ధి కలిగిన మరణ పర్యంతము స్థిరముగా ఉండును."

# నవభారత నిర్మాతలు

## అరబిందో ఘోష్

యు. సుబ్రహ్మణ్యం

కోర్టులో నిలబడియున్న ఆ ఖైదీ కేంబ్రిడ్జ్‌లో చదివిన విద్యార్థి. ఆధ్యాత్మిక దృష్టిగల



వివేకవంతుడు కోర్టులో అతడి వాఙ్మూలాన్ని అతడి లాయరు చదువుతున్నాడు. కోర్టు గదిలోను, వరండాలలోను జనం క్రిక్కిరిసిపోయి వీక్షిస్తున్నారు.

"మీ సమక్షంలో నేను విన్నవించుకునే విషయం ఇది. నేను న్యాయ విరుద్ధంగా దేశానికి స్వాతంత్ర్యం ఉద్బోధిస్తే ఆ నేరం చేసానని నేను ఒప్పుకుంటాను. స్వాతంత్ర్య భావాన్ని బోధించడం నేరమయితే నేను నేరం చేసానని చెబుతున్నాను. నేను చేసినదే నేరమైతే నన్ను బంధించి జెయిలులో శిక్షించవచ్చు. నేను చేసిన పనులు చట్ట విరుద్ధమనడం అసంభవమని నేను విన్నవించుకుంటున్నాను నేను చేసే పని నేను చెప్పినదానికి, వ్రాసినదానికి, నా అభిప్రాయానికి అసందర్భమని నిరూపించడానికి సాక్ష్యం లేదు."

కోర్టులో ఈ ఖైదీతోపాటు ఇంకా 48 మంది నేరస్థులు ఉన్నారు. 206 మంది సాక్షులు ఉన్నారు. 400 డాక్యుమెంట్లు ఫైలు చేయబడ్డాయి బాంబులు, రివాల్వర్లు, మందుగుండ్లు, డెటోనేటర్లు వగైరా 5000 వస్తు

---

### గుజరాత్ సమృద్ధిగా పాలను ఉత్పాదించే రాష్ట్రం

ఆనంద్ డైరీ ఉన్న గుజరాత్ రాష్ట్రం అధిక పాల ఉత్పాదక కేంద్రంగా ప్రసిద్ధి పొందింది. మధ్యప్రదేశ్ రెండవ స్థానాన్ని ఆక్రమిస్తూంది.

"పిరికి పందకు అందరూ శత్రువులే."

వుడు ప్రదర్శింపబడ్డాయి. తాను దోషిని అని ఒప్పుకున్న ఒక నేరస్థుని తుపాకీతో కాల్చి చంపారు. పోలీసు బందోబస్తుతో, కట్టుదిట్టా లతో ఖైదీలను కోర్టులో నిలబెట్టారు. చీఫ్ ప్రాసిక్యూటరు ఇయర్డ్లీ నార్టన్ తీర్పు పూర్తిగా చెప్పేదాకా పెట్టెలో తుపాకీని ఉంచుకుని జాగ్రత్తపడ్డాడు.

నేరస్థుల తరపున లాయరు చిత్తరంజన్ దాస్. గొప్ప మేధావి. అతి నైపుణ్యంగా కేసును వాదించాడు. ఇద్దరు నేరస్థులకు మాత్రం శిక్ష తప్పలేదు. కొంతమందికి విధించిన శిక్ష తగ్గించబడింది. మన ఖైదీతో పాటు కొంతమంది విడుదలచేయబడ్డారు. అదే 1909 వ సం. నాటి అలిపూర్ విచారణ. అరబిందొఘోష్ నవభారత నిర్మాతలలో ముఖ్యుడు. ఇతడే ఆ ఖైదీ.

ఒక సంవత్సరం ముందే జాతీయ ఉద్య మాలలో పాల్గొన్నాడనే నేరంమీద 15 సం.ల బాలుణ్ణి కలకత్తా చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు కింగ్స్‌ఫర్డ్ సమక్షంలో అధికారులు కొరడా లతో కొట్టి శిక్షించారు. విప్లవకారులు సమయంకోసం వేచి ఉన్నారు కింగ్స్‌ఫర్డ్‌ను చంపడానికి సిద్ధంగా ఉన్నారు. ఇంతలో కింగ్స్‌ఫర్డ్‌ను ముజాఫర్ పూర్‌కు బదిలీచేసారు. ఇట్టి సమయంలో కొందరు విప్లవకారులు అతడి బండిపై ఒక బాంబును విసిరారు. బాంబు ప్రేలి బండిలో ప్రయాణం చేస్తున్న శ్రీమతి కెన్నెడి, ఆమె కుమార్తె మరణిం చారు.

ఇది ఏప్రిల్ 30, 1908 న జరిగిన






సంఘటన. ఈ సంఘటనను అనుసరించి అరవిందొఘోషుని, మరి కొంతమందిని బంధించి జెయిలులో ఉంచారు. చిత్తరంజన్ దాస్ అతి నైపుణ్యంగా వాదించాడు. అరవిందొఘోషును విడుదల చేసారు.

అరవిందొ ఆగస్టు 15, 1872 లో కలకత్తాలో కొన్నాగర్‌లో శ్రీమంత గౌరవ కుటుంబంలో జన్మించాడు. విదేశీ వాతావరణంలో పుట్టి పెరిగాడు. ఇంగ్లండ్ కేంబ్రిడ్జిలో ఐ.సి.ఎస్. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. 1892 వ సం.లో తాను పొందిన ఐ.సి.ఎస్. ను నిరాకరించి భారతదేశానికి తిరిగి వచ్చి బరోడా సంస్థానంలో 13 సంవత్సరాల పాటు ఉద్యోగం చేసాడు. ఇచ్చట ఉద్యోగం చేస్తూ ఉన్నప్పటికి భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వాన్ని పడగొట్టడానికి తీవ్ర ప్రయత్నాలు కొనసాగిస్తూనే ఉన్నాడు. 1905 వ సం.లో వంగదేశ విభజన తరువాత ఇతడు కలకత్తాచేరి భారత జాతీయ కాంగ్రెస్‌లో తీవ్రవాదులకు తగిన ప్రోత్సాహాన్ని, ప్రోద్బలాన్ని కలిగించాడు.

గాంధీజీ అడుగుజాడలలో సంపూర్ణ స్వాతంత్ర్యమే తన ముఖ్యధ్యేయమని, విదేశీ బట్టలను తగులబెట్టుచూ, సహాయ నిరాకరణ ఉద్యమాలతో సత్యాగ్రహాన్ని అనుసరించాడు.

బ్రిటిషు పరిపాలకులకు ఇతడిమీద ఒక కన్నుఉంది. గవర్నర్ జనరల్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాకు "నేను తిరిగి చెప్పక తప్పలేదు. ఇతడు మనకు ఉపద్రవం కలిగిస్తున్నాడు" అని వ్రాసాడు. బాంబ్ కేసులో విడుదల అయిన అరవిందొఘోష్ ముఖ్యంగా భారతజాతీయోద్యమం (Indian Nationalism) అమూలాగ్రంగా వివరిస్తూ 'కర్మయోగిన్' 'ధర్మ' అను రెండు వార పత్రికలు నడిపించాడు. ఫిబ్రవరి 1910 లో ఇతడు రాజకీయ ఉద్యమాలకు స్వస్తి చెప్పి బెంగాల్‌లో ఫ్రెంచి సెటిల్‌మెంట్ అయిన చంద్రనాగూర్‌లో చేరాడు.

ఈ సమయంలో స్వామి వివేకానందుని శిష్యురాలు సోదరి నివేదిత మరికొందరు అభిమానులవల్ల తనను ఆంగ్లేయ ప్రభుత్వం దేశంనుంచి వెడలగొట్టనున్నారని తెలుసుకుని ఏప్రిల్ 1, 1910 వ మద్రాసు చేరువగా

---

## పెద్ద వజ్రాలలో 'జేకబ్' ఒకటి



ప్రపంచపు సుప్రసిద్ధ వజ్రాలలో భారత దేశపు పెద్ద వజ్రాలు 'కోహినూర్', 'రంజిత్' తరువాత ఐదవదో లేక ఆరవదో జేకబ్. ఇది హైదరాబాద్ నైజాము తాత మీర్ మహబూబ్ అలీఖాన్‌కు అమ్మబడింది.

"గొప్పలకు పోక, వాంఛలను తగ్గించుకుని
ఐహిక సుఖాలను జయించువాడు వివేకవంతుడు."

భారతదేశంలో ముఖ్యమైన ఫ్రెంచి సెటిల్‌మెంట్ పాండిచ్చేరిలో నివాసం ఏర్పరచుకున్నాడు.

ఇక్కడే ఇతిడికి మద్రాసు (ఇప్పుడు తమిళనాడు) కు చెందిన గొప్ప విప్లవకారుడు కవి అయిన సుబ్రహ్మణ్యభారతి, సుప్రసిద్ధ విద్వాంసుడు, పండితుడు అయిన వా. రా. జాతీయ ఉద్యమాలలో పేరు ప్రతిష్ఠలు పొందిన అఖండ ప్రజ్ఞావంతుడు వి.వి.ఎస్. అయ్యరు మొదలైన వారితో సంబంధాలు ఏర్పడ్డాయి.

కాలం గడుస్తున్నకొద్దీ ఈ జాతీయ వీరులతో సంబంధాలు సడలిపోయాయి. అరవిందునికి అంతర్దృష్టి ప్రబలింది. సహజంగా ఉన్న ఆధ్యాత్మిక దృష్టి ప్రవృద్ధి పొందింది. అపూర్వమైన శిష్యబృందంతో ఒక ఆశ్రమం ఏర్పాటు కావింపబడింది అరవిందుడు తీవ్రమైన సాధనలు పూనుకున్నాడు. ఈ సమయంలో ఇతరికి పాల్. మేడమ్ రిచర్డ్‌ల అమూల్య సహాయం లభించింది 'ఆర్య' అనే శాస్త్రీయ మాసపత్రిక స్థాపించబడింది.

శ్రీ అరవిందుని పేరు దేశ దేశాల మారు మ్రోగి తూంది. అరవిందయోగి ప్రపంచ సమైక్యతోపాటు భారతదేశపు స్వాతంత్ర్యాన్ని - శిమాసిమా మానవత్వం సంపూర్ణ పరివర్తనతో నిత్య సత్య చైతన్యవంతమైన సమాజోద్భవాన్ని దర్శించగలిగాడు. సమైక్య యోగ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ధర్మము, వాఙ్మయమ మొదలైన విషయాలను విపులంగా విశదించాడు. అప్పుడప్పుడు ప్రవచిస్తూ అరుదుగా కవిపిస్తూ శ్రీ అరవింద యోగి 40 సంవత్సరాల పాటు ఏకాంత జీవనంలో తన దివ్య సందేశాన్ని ప్రతిపాదిస్తూ లక్షలాది శిష్యులకు ఆధ్యాత్మిక ఉత్తేజాన్ని కలిగించాడు. డిసెంబరు 5, 1950 న తన 78 వ ఏట శ్రీ అరవిందుడు సమాధి పొందాడు. పాండిచ్చేరిలోని అరవిందాశ్రమం, అంతర్జాతీయ ఆరోవిల్లి నగరం ఆధ్యాత్మిక యోగి అరవిందుని జ్ఞాపకార్థంగా ప్రవృద్ధిని పొందుతున్నాయి. ●

## సాగర గర్భంలో సొరంగం



జపానులో హోన్‌షూ (Honshu) కు ఉత్తరవైపు ద్వీపం హొక్కాయిదో (Hokkaido) ను కలుపుతున్న 53.85 కి.మీ పొడవైన 'సియకాన్ సబ్‌మెరైన్ టన్నెల్' నిర్మాణం ఈ మధ్యనే పూర్తి అయింది. ట్సుగారు జలసంధిలో సముద్రంలో 240 మీటర్ల అట్టడుగున 22 సంవత్సరాలు పనిచేసి ఈ నిర్మాణాన్ని పూర్తి చేశారు. ప్రపంచంలో అతి పొడవైన ఈ సాగర గర్భపు సొరంగానికి సుమారు రూ. 3,450 కోట్లు ఖర్చు అయింది.

"ఆత్మోన్నతికి తోడ్పడునదియే నిజమైన విద్య."

# స్నేహాన్ని సంరక్షించుకోవాలి

ఇతోధికంగా ప్రవృద్ధిని పొందించుకుని ఎప్పటి కంటే పటిష్ఠవంతం చేసుకోవాలంటే స్నేహాన్ని సతతం సంరక్షించుకోవాలి. జాగ్రత్తగా పరిపోషించుకోని స్నేహం అతి



సులభంగా నశించిపోవడానికి అవకాశముంది. స్నేహ బాంధవ్యాలను ఉపేక్షిస్తే మానసికంగా కలతలు, విరోధాలు ఏర్పడతాయి పరస్పర విశ్వాసం చెడిపోతుంది. స్నేహం చెడిపో తుంది.

ప్రతి ఒక్కరి జీవితంలోను స్నేహం యొక్క పాత్ర చాలా ముఖ్యమైనది. ప్రేమా నురాగాలను పంచుకుని అపూర్వ అనుభూతు లను పొందడానికి స్నేహం ముఖ్యం. స్నేహ బాంధవ్యాలు లేని మనిషికి సాంఘిక సామ రస్య జీవితానికి ఆధారభూతమైన వారధి నిర్మించుకుని ఉత్సాహాన్ని పొంది జీవితంలో కష్టాలను పంచుకోడానికి వీలుకలగడం లేదు. అటువంటి వారు జీవితంలో ఎప్పుడు ఋణ భావాన్ని పెంచుకుంటారు. వారికిజీవితందుర్భ రంఅనిపిస్తుంది, విరాళతో కృంగిపోతారు.

"నేను", "నాది" అనే సంకుచిత భావన లేకుండా ఇతరుల కష్టసుఖాలను పంచు కుంటుంటే స్నేహం వర్ధిల్లుతుంది. వాస్తవ మైన విశ్వాసం, ప్రేమ, అనుబంధం స్నేహి తులను చేరదీస్తుంది. మంచి స్నేహాలను పెంచుకోడం వల్ల బుద్ధి జాడ్యం పోతుంది. సత్య సంధత ఏర్పడుతుంది. సంఘంలో గౌరవం పెరుగుతుంది. పాపాలను పోగొడు తుంది. మనస్సును నిర్మలంగా చేస్తుంది. కీర్తి వ్యాపింపచేస్తుంది. ●

---

## అంతరిక్ష సమాధి

కొంతమంది ఇంజనీర్లు. ప్రేత కర్మలు చేయించేవారు ఉమ్మడిగా చేరి ఒక్కొక్క దానికి 3,900 డాలర్లు చొప్పున వసూలుచేసి 10,330 మంది మృతదేహాలకు అంతరిక్షంలో సమాధులను నిర్మించదలచుకున్న ప్లానుని అమెరికా ప్రభుత్వం అంగీకరించింది. వ్యాపారరీత్యా నిర్మితమైన రాకెట్ ఒకటి ప్రపంచంలో మొదటి అంతరిక్ష సమాధిని అమెరికా వర్జీనియాలో వాలప్స్ ద్వీపం (Wallops Island) నుంచి 1987 మధ్యలో అంతరిక్షంలోకి ప్రవేశపెడుతుంది.

"నీరు పల్లమునకు ప్రవహించునట్లే, దుర్గుణము మానవుని అధోగతికి చేర్చును."

# ముక్కు ముచ్చట్లు

ముక్కు ముఖానికి అందం. ముక్కు ముప్పై ఏళ్ళు పెరుగుతుందంటారు. వాసన, సువాసన, దుర్వాసన అన్నీ ముక్కుకే తెలుస్తాయి. ఆకారాన్ని బట్టి ఈ



ముక్కును చప్పిడి ముక్కు, దొండ్ర ముక్కు, చిలక ముక్కు వగైరా అంటారు. అంగముల ప్రత్యేకతను బట్టి వ్యక్తులకు పేరుపెట్టే ఆచారం ఆంధ్రదేశంలో నే కాదు ప్రతీ చోటా ఉండటం మామూలే. 'పొట్టి చేతులవాడు, వంకర కాళ్ళవాడు, మెల్ల కన్నువాడు' అంటుంటారు. అలాగే రాయల ఆస్థానంలో చేరి తరువాత అష్టదిగ్గజ కవులలో ఒకడుగా ప్రఖ్యాతి కెక్కిన వాడు నంది తిమ్మన. ఇతడితో పాటే రాయల ఆస్థానంలో తిమ్మరుసు. వాకిట కావలి తిమ్మన అని ఇంకా ఇద్దరుండేవారు. వీళ్ళందరిలోకి ముక్కు పెద్దదిగా ఉన్న నంది తిమ్మన్నను ముక్కుతిమ్మన్న అన్నారు సులభంగా తెలియడానికి. ముక్కు తిమ్మనార్యు ముద్దుపలికే పారిజాతాపహరణము. ఇతడు ముక్కు మీద వ్రాసిన "నానా సూన వితాన వాసనల నానందించు సాగరమే' అనే పద్యంలో భావ సౌందర్యాన్ని మెచ్చి భట్టుమూర్తి తిమ్మన దగ్గర దానిని విలిచి తన గ్రంథంలో ఇరికించాడంటారు. ముక్కుమీద ముచ్చటగా పద్యం వ్రాసాడని నంది తిమ్మనను ముక్కుతిమ్మన అంటారు అని కొందరి అభిప్రాయం.

## ప్రపంచంలో ఎక్కువగా కాలుష్యమైన నగరాలు

ప్రపంచ ఆరోగ్యసంస్థ(World Health Organisation) అధ్యయనం ప్రకారం ప్రపంచ నగరాలలో మిలాన్ (ఇటలీ), మాడ్రిడ్ (స్పెయిన్), ఢిల్లీ (భారతదేశం), బాగ్దాద్ (ఇరాక్), టెహరాన్ (ఇరాన్), రియో డి జనెరో (బ్రెజిల్) ఎక్కువగా సల్ఫర్ డయాక్సైడ్ మరియు పొగతో కాలుష్యమైన నగరాలు.

"కన్నులు పోయినవాడు అంధుడు కాదు,
తప్పులు కప్పి పెట్టుకున్నవాడు అంధుడు."

ముక్కు లేని వాళ్ళను ముక్కిడి అంటారు. "ముక్కిడి తొత్తుకు ముత్యంపు నత్తేల?". ఆడవాళ్ళు ముక్కున ధరించే ఆభరణం (ముంగర) ముక్కర. అతి శీఘ్రంగా కోపం వచ్చేవాళ్ళకి ముక్కుమీదుంటుంది కోపం. మంచి చెడ్డలు తెలియని వాళ్ళకి ముక్కు, మొగం తెలియదు. ముక్కున వ్రేలు పెట్టుకుని కొందరు ఆశ్చర్యపడతారు. బ్రతికి ఉన్నంత కాలం ముక్కున ఊపిరి ఉంటుంది. ఏ ప్రయత్నం చేయనివాళ్ళు ముక్కు పట్టుకు కూర్చుంటారు. మొగమాటం లేకుండా ముక్కు మొగం చూడరు. ముక్కులు కొరుక్కున్న ప్రణయ కలహాలు కూడా ఉన్నాయి.

ముక్కు లేకపోతే వేలకొద్దీ జనం నిరుద్యోగులుగా ఉండవలసిన వాళ్ళే. సౌందర్యవర్ధకాలైన పరిమళ వస్తు పరిశ్రమలో ముక్కు విలువ ముక్కోటి. మహిళల ముక్కును ఆధారం చేసుకునే కాస్మెటిక్ పరిశ్రమలు ప్రవృద్ధి పొందుతున్నాయి. ఎందరెందరో వైజ్ఞానిక నిపుణులు 'నోస్ పౌడర్' (ఫేస్‌పౌడర్ అని, మేకప్ అని ప్రచారం కొనసాగిస్తున్నారు) ను ఎప్పటికప్పుడే అభివృద్ధి పరచడానికి పరిశోధనా నిమగ్నులై ఉన్నారు. పెద్ద పెద్ద ఇంజనీర్లు, చేతి పనులవాళ్ళు, కూలీలు ఇతర ఫ్యాక్టరీ పనివాళ్ళు ఎంతోమంది పగలనక రాత్రనక రకరకాల రంగుల షేడుల శ్రేణిలో "నోస్ పౌడర్" తయారుచేసి ప్యాక్ చేసే కార్యకలాపాలలో పనులుచేస్తారు. ముక్కు నూనె ఓడుతూ నిగనిగలాడకుండా చేస్తుంది ఈ పౌడరు.

దీన్నిబట్టే చేతి రుమాళ్ళను తయారుచేసే వారు కోకొల్లలుగా బయలుదేరారు. ప్రతి నిత్యం లక్షలకొద్దీ తెల్లవి, రంగు రంగులవి, గళ్ళవి చేతి రుమాళ్ళు ముక్కు తుడుచుకోడానికి తయారు చేస్తారు.

నశ్యం (ముక్కు పొడి) తయారుచేసే ఫాక్టరీలు కూడా జీవనోపాధికి ఈ ముక్కు మీదే చాలా మటుకు ఆధారపడి ఉంటాయి. నోస్ డ్రాపులు, ఇన్‌హేలర్లు తయారుచేసే

---

## ఆత్మ ఔన్నత్యాన్ని పొందుతాను!



"నీకు కోపం తెప్పించిన వారి మీద కసి తీర్చుకోవేమి?" అని ఫ్రెంచి తత్త్వవేత్త రీనీ దెస్కార్టేస్‌ను కొందరు అడిగినప్పుడు రీనీ 'ఎవరైనా నాకు కోపం తెప్పించాలని అనుకున్నప్పుడు వారి ఆగ్రహాలకు అందకుండా ఆత్మ ఔన్నత్యాన్ని పొందుతాను' అని జవాబు చెప్పాడు.

"సత్యాన్వేషణలో ఓటమికి స్థానమే లేదు."

కెమిస్టులు. ఎడినాయిడులు (ముక్కుల్లో పెరిగే దుర్మాంసం) సైనసు రోగాలు మొదలైన దోషాలకు శస్త్రచికిత్సను చేయడానికి సిద్ధంగా ఉన్న వైద్యులు మొదలైనవారి అందరికీ ముక్కుమీదే జీవనం. సంవత్సరం పొడుగునా వీళ్ళని ముక్కు చాలా హడావిడిగా ఉంచు తుంది.

ముక్కులవల్ల మనకు ప్రయోజనం ఏమిటి? రోడ్డుమీద అకస్మాత్తుగా జరిగిన ప్రమాదంలో ముక్కుకు తీవ్రమైన గాయం తగిలి ఘ్రాణ శక్తిని పోగొట్టుకున్న వ్యక్తికి కోర్టులో రూ. 50,000 నష్టపరిహారం ఇప్పించారు జడ్జిగారు.

చాలా మంది జీవనోపాధికి ముక్కే ఆధారం. మూనెశుద్ధి కర్మాగారాలు (Oil Refinery), గంధ నిర్ణయవారు (Smell-observer) లను నియమిస్తారు వీరు ముఖ్యంగా తయారయే నూనెల వాసనలు, పరిమళాలు సరి అయిన స్థాయిలో ఉన్నాయా లేదా అని పరీక్షిస్తారు

పెద్ద పెద్ద రసాయనిక పరీక్షలలో కూడా తెలవి వాసనా వైవిధ్యాలను ముక్కు పట్ట గలదు పరిమళ వస్తువుల, సువాసన ద్రవ్యాల పరిశ్రమలకు 'ముక్కు' పాత్ర చాలా ముఖ్యం. వాసనలు చూచి మంచిరకం వైనులు తయారవకపోతే మార్కెట్‌లో వైనుదొరకడమే దుర్లభమయేది. వివిధ దేశాలలో నటీనటులు, సుప్రసిద్ధ అందగత్తెలు తమ ముక్కుని ముఖానికి సరిగ్గా అమరేటట్టు తీర్చి దిద్దుకోడానికి ప్లాస్టిక్ సర్జరీ చేయించు కుంటారు. ముక్కును భీమా చేయించుకున్న వ్యక్తులున్నారు. ప్రస్తుతంగా అందమైన ముక్కుతో ముఖ సౌందర్యాన్ని అభివృద్ధి చేసుకొని వ్యక్తిగత ఆనందం పొందడం ఈ నాటి భాగ్యవంతుల లక్షణంగా పరిణ మించింది.

ఇది భారత దేశానికి క్రొత్త కాదు. భార తీయులు ముక్కుకు శస్త్రచికిత్స 3,000 సంవత్సరాల క్రితమే ప్రారంభించారు. ఇటలీలో 16 వ శతాబ్దంలో ముక్కును తీర్చి దిద్దే నిపుణులకు ఎక్కువ గిరాకీ ఉండేది. చేతులమీది చర్మంతీసి ముక్కులకు అతికే వారు.

అమెరికాలో కోటీశ్వరుడైన పీర్ పాయింట్ మోర్గాన్ ముక్కు అత్యంత విలు వైనది. అతడికి ముక్కుమీద ఎర్రటి పొడు పొటికాయ లేచింది. దానికి తగిన శస్త్రచికిత్స చేయించుకుని ముక్కును సరిచేసుకోడానికి అతడు అనేక లక్షలు వ్యయంచేసాడు. కాని ముక్కు మారలేదు.

400 సం. ముందు దేనిష్ ఖగోళ శాస్త్ర జ్ఞుడు టైకోబ్రహేకి ఒక ద్వంద్వయుద్ధంలో ముక్కు ఎగిరిపోయింది. వెంటనే అతడు బంగారంతో చేసిన ముక్కును తాపడం చేయించుకున్నాడు. అది ఒక సౌందర్య సాధనగా పరిణమించింది ప్రపంచ సుప్రసిద్ధ సినీనటుడు జిమ్మీ డ్యూరాన్ట్స్ తన అందమైన ముక్కును 1,40,000 డాలర్లకు భీమా చేసు కున్నాడు ●

"మానవుడు తన్నుతానే ఉద్ధరించుకొనును.
తనకు తానే శత్రువై నాశన మొనరించుకొనును."

# పక్షుల అద్భుతయాత్ర

డా. సుధిన్ సేన్ గుప్త

చరిత్ర ప్రారంభమైనప్పటి నుంచీ కూడా ఆయా ఋతువుల్లో వలసలు పోతూన్న గుంపులు గుంపులు పక్షులను చూసి మానవుడు దిగ్భ్రమతో ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.



ఖగోళాన్ని పూర్తిగా కప్పేసినట్టుగా ఎగిరే ఈ పక్షుల గుంపులు ఒక్కొక్కప్పుడు అసలు కనిపించకపోవడం మానవునికి మరింత అద్భుతం అనిపించింది.

ఈ విధంగా కాలానుగుణ్యంగా జరుగుతున్న పక్షుల వలస విధానం ఆధారంగా జానపద సాహిత్యం ఎంతో వృద్ధి పొందింది. ఎన్నెన్నో కథలు, కావ్యాలు బయలు దేరాయి.

ప్రపంచంలో ఉండే పక్షి సంతతిలో సుమారు ఒక మూడవ వంతు ప్రతి సంవత్సరం తమ నివాస ప్రదేశాలను మార్చుకుని దూరప్రదేశాలకు వలసలు పోతూ ఉంటాయి. పక్షుల జీవిత వలయంలో ఈ వలస విధానం ఎంతో ముఖ్య పాత్రను వహిస్తూంది. ప్రతి సంవత్సరం జరిగే వలసల ప్రయాణంలో వేలకొద్దీ పక్షులు మరణిస్తున్నాయి.

ఉత్తర అమెరికాలో ఆర్కిటిక్

## ఎక్కువ ప్రచారం గల దిన పత్రిక

1981 మరియు 1982 సం.ల మధ్య భారతదేశంలో వార్తాపత్రికలు సాలీనా 4.1 శాతం అధికమైనట్లు గుర్తించారు. 1961 నుండి 20 సం.ల కాలంలో 3 రెట్లు అయింది. 1982 సం.లో ప్రచురించిన 1,334 దిన పత్రికలలో కలకత్తాలో ప్రచురింపబడే 'అమృత బజార్' పత్రిక 4,06 276 ప్రతులు ప్రచురింపబడే ఏకైక దినపత్రిక వారపత్రికలలో కొట్టాయంలో ప్రచురింపబడే మలయాళ వారపత్రిక 'మలయాళ మనోరమ' 5,77,730 ప్రతులతో ప్రథమ స్థానాన్ని అలంకరిస్తూంది.

"తపస్సు, ఇంద్రియ నిగ్రహం, గొప్ప విద్య
ఈ మూడును శాంతగుణమునకు హేతువగును."

ంతంలో గోల్డెన్ ప్లొవర్ పక్షుల వలన
ానం నేటికీ శాస్త్రజ్ఞులను తికమకలు
కుతూనే ఉంది. ఈ జాతి పక్షులు సర్వ
ధారణంగా ఆర్కిటిక్ వలయంలో
ంచుతో కప్పబడిన శీతల ప్రదేశాలలో నివ
స్తాయి. ఇవి మంచు మీద బ్రహ్మాండమైన
ంతో సంచరిస్తాయి. ఎంతో సామర్థ్యంగా,
ృతంగా ఎగురుతాయి. సుమారు 1,600
ళ్ళ దూరం కూడా అతి నైపుణ్యంగా
రగలవు.

జూన్ నెల వచ్చేటప్పటికి గోల్డెన్ ప్లొవర్
పిల్లలకి స్వాతంత్ర్యం వచ్చేస్తుంది.
క్కాలికంగా పెద్ద పక్షులతో సంబంధం
పోతుంది. ఈ తల్లి పక్షులు, పెద్ద పక్షులు
ు పిల్లలను వదలి దక్షిణ ప్రాంతాలకు
సలు బయలుదేరతాయి. ఇవి ఆగ్నేయ
క్కగా ఉత్తర అమెరికా మీదుగా ప్రయా
ంచి కెనడాకు ఆగ్నేయ దిక్కున ఉన్న తీర
దేశం నోవా స్కోటియాకి చేరతాయి.
క్కడ స్థిరంగా ఉండవు. వెంటనే ఈ
క్షులు అక్కడ నుంచి బయలుదేరి అట్లాం
క్ మహాసముద్రం మీదుగా పయనించి
క్షిణ అమెరికాలో ఉత్తర మధ్య అర్జెంటైనా
ంపాస్ గడ్డి మైదానాలలో ప్రవేశిస్తాయి.

ఇంకో నెల రోజులకు ఆర్కిటిక్ వల
ంలో గూటినుండి బయటకు వచ్చిన చిన్న
క్షులు తొలిసారిగా వలసకు బయలుదేర
యి. ఇవి మరో మార్గంలో బయలుదేర
యి. పెద్ద పక్షులు వెళ్ళిన మార్గంలో
ళ్ళవు. ఇవి ఉత్తర అమెరికా విశాల ప్రదే
శాలను దాటి దక్షిణ అమెరికా చివర ఉన్న
ఎత్తైన ఆండీసు పర్వతశ్రేణి దగ్గరకు
వస్తాయి. అక్కడి నుంచి బయలుదేరి పర్వత

---

# మీ పిల్లలు కారు



KAHLIL GIBRAN

మీ పిల్లలు మీ పిల్లలు కారు. అపూర్వ ప్రాణశక్తి సంతానం. నీవు వారికి ఆలంబన మాత్రమే వారు నీతో ఉన్నా నీకు చెందిన వారు కారు. మీ ప్రేమాభిమానాలు వారిపై చూపవచ్చు గానీ నీ మనోభావాలను ప్రసాదింపలేవు. వారి మనోభావాలు వారికుంటాయి. వారి శరీరాలు నీ అధీనంలో ఉండవచ్చు. కాని వారి ఆత్మలు నీ అధీనంలో లేవు. వారి ఆత్మలు రేపటి ప్రపంచంలో ఉంటాయి. వారి వలె ఉండటానికి నీవు ప్రయత్నించవచ్చు కాని, వారిని నీలా ఉండేటట్టు బలాత్కరించ వద్దు. జీవితం వెనక్కు వెళ్ళదు. గతించిన దానిని పట్టుకు ప్రాకులాడ వద్దు.

"దేహమున నాటిన బాణములను తీయవచ్చునుగాని
మనసున నాటియున్న మాటలను తీయుట అసాధ్యం."

ప్రదేశాలను దాటి అర్జెంటైనా పంపాస్ గడ్డి మైదానాలను చేరతాయి.

ఇక్కడే ఈ చిన్న పక్షులు మొదట బయలు దేరిన తమ తల్లిదండ్రులను కలుసుకుంటాయి. వేసవి కాలమంతా ఈ పక్షులన్నీ ఇక్కడ గడ్డి మైదానాలలోనే జీవితాన్ని గడుపుతాయి.

శీతాకాలం ప్రారంభమయ్యేటప్పటికి తిరిగి ప్రయాణం ప్రారంభం. ఈ సారి చిన్నవీ, పెద్దవీ అన్ని పక్షులు ఉమ్మడిగా బయలుదేరి చిన్న పక్షులు వచ్చిన మార్గంలో ఎగురుకుంటూ ఆండీసు పర్వతశ్రేణిని దాటి ప్రథమ నివాస స్థానాన్ని చేరుకుంటాయి. తొలిసారి వలస పూర్తి అయిన తరువాత పక్షిపిల్లలు తిరిగి దక్షిణ దిక్కుగా వలస ప్రారంభిస్తాయి. ఈ విధంగా బ్రతికి ఉన్నంత కాలం వలస వలయం పరిభ్రమిస్తూ ఉంటుంది. ప్రప్రథమంలో పెద్ద పక్షులు వలసలకు బయలు దేరటం వల్ల పెరిగి ప్రవృద్ధిని పొందుతూన్న తమ చిన్న పిల్లలకు అవసరమైన ఆహారానికి కలిగే పోటీ బాగా తగ్గుతుంది ఏదైనప్పటికీ ఎంత మాత్రం అనుభవం లేని పక్షిపిల్లలు అకస్మాత్తుగా బయలుదేరి పరిచయం లేని క్రొత్త ప్రదేశాలకు వేలకొద్దీ మైళ్ళు ఎగిరి తమ తలిదండ్రులను కలుసుకోవడం ఒక అద్భుత విషయం. ఈ చిన్న పక్షులు నిరపాయకరమైన భూమార్గాన్నే అనుసరించడం మరో ఆశ్చర్యకరమైన విషయం.

గోల్డెన్ ప్లోవర్ పక్షులు గుంపులు గుంపులుగా జీవిస్తాయి. సాధారణంగా చిన్న చిన్న పురుగులు, వెన్నెముక లేని జంతువులే వీటి ఆహారం. ఆర్కిటిక్ వలయం మీదుగా

---

## గొప్ప ఆర్థిక మంత్రి



ఒక ఇంటిలో కుటుంబాన్ని తీర్చి దిద్దే ఉత్తమ ఇల్లాలు ఇంటికి మహారాణి వంటిది. భర్తకు, పిల్లలకు వారివారి పనులు నిర్వర్తించు కోడానికి తగినట్లు సహకరిస్తుంది.

వారిని కష్టాలలో ఆదుకుంటుంది. వేళకు ఆహారం పెడుతుంది. సంరక్షిస్తుంది. ఇంటి బడ్జెటును అతి సామర్థ్యంగా నిర్వహించే ఆర్థిక మంత్రి. ఇంటి అందాన్ని చక్కదిద్దే లలితకళలకు ప్రత్యేక మంత్రి.

కుటుంబ విద్యావిషయక మంత్రి. పిల్లల స్కూలు, కాలేజీ విద్యను పర్యవేక్షిస్తుంది. కుమార్తె కుశాగ్రబుద్ధికి నైపుణ్యానికి కారకురాలు. దేశంలో ఉత్తమ నాయకుడు దేశ వ్యవహారాలను చక్కబెట్టినట్లు ఇంట్లో కుటుంబాన్ని చక్కదిద్దే మహిళ సామర్థ్యం అద్వితీయం.

"గొడ్డంట నరికిన చెట్టు మరల చిగురించునుగాని
మాటలచేత నశించిన మనస్సు కుదుటబడ నేరదు."

'బులు వీచే మే మాసంలో వీటి జీవితంలో ఒక నూతన ఉత్సాహం బయలుదేరుతుంది. మగ, ఆడ జాతి పక్షులలో పరస్పర ప్రేమ, ప్రణయం వృద్ధి పొందుతుంది. మగ పక్షులు వింత వింత ధ్వనులు చేస్తూ ఆకాశంలో అనేక చేష్టలతో ఆడ పక్షులను ఆకర్షిస్తాయి. ఈ పక్షుల కిలకిలారావాలు ప్రతిధ్వనిస్తూ ఉంటాయి.

కొంత కాలం ఈ విధంగా ప్రేమ కలాపాలు జరిగిన తరువాత క్రొత్త జీవితానికి ఈ పక్షులు జతలు కడతాయి. గూడు కట్టుకుంటాయి భూమిమీద చిన్న పల్లం చేస్తాయి. ఈ పల్లంలోనే ఆడ పక్షి నాలుగు గుడ్లను పెడుతుంది ఇతర జంతువులు వచ్చి వీటిని తినేయకుండా అతి రహస్యంగా సంరక్షించుకుంటాయి. శత్రు భయం కలిగినప్పుడు పక్షులు దూరంగా ఎగిరిపోయి రెక్కలు జాచి ముక్కు వ్రేలాడేసుకుని చచ్చిపోయినట్టు క్రింద పడిపోతుంది. ఒక్కసారి కీచుమని అరుస్తూ తిరిగి చచ్చినట్టు పడిపోతుంది. ఇది చూసి శత్రుపక్షులు. ఇతర మృగాలు పారిపోతాయి. వెంటనే ప్రాణం పోసుకుని రివ్వున ఎగిరిపోతుంది

24 రోజుల పాటు తీవ్రంగా గ్రుడ్లను పొదిగిన తరువాత గ్రుడ్ల నుంచి చిన్నపక్షులు బయటకు వస్తాయి. ఒక్కసారిగా ప్రపంచ సౌందర్యాన్ని చూస్తాయి ఈ చిన్న పక్షులు వాటంతట అవి ఆహారం తినగలిగినా ఒక వెల రోజులపాటు పెద్ద పక్షులతోనే జీవిస్తాయి. తరువాత నూతన ప్రపంచంలోకి వచ్చి క్రొత్త జీవితాన్ని ప్రారంభిస్తాయి. ●

# ఎలా?

## భూమి గోళమని ఎలా తెలుసుకోగలం?



అనేక విధాలుగా తెలుసుకోవచ్చు. 1. సముద్రం మధ్య ప్రయాణం చేస్తున్న ఓడ ఏ దిక్కుగా వెడుతున్నా సరే క్రమ క్రమంగా అదృశ్యమై పోతుంది. 2. ఒకచోట బయలుదేరి ఒకే దిక్కుగా ప్రయాణం చేస్తున్న వ్యక్తి తిరిగి బయలుదేరిన చోటికే చేరుకుంటాడు 3. చంద్రుని మీదపడే భూమి నీడ ఎప్పుడూ వర్తులాకారంలో గాని, వర్తుల ఖండాలలోగాని ఉంటుంది.

---

## ఓడల దోపిడీగాడు

ఓడల దోపిడీగాడు (Pirate) అని ప్రఖ్యాతి పొందిన హెన్రీ మోర్గాన్ 1672 సం.లో జమైకా (కరీబియన్ సముద్రంలో పడమటి దీవులు) లెఫ్టనెంట్ గవర్నరుగా నియమితుడె నాడు.

"అన్ని వ్యాధులకు మానసికానందం దివ్యౌషధం." -స్వామి రామదాసు

# సినీ ప్రపంచం



భారతదేశం మూడవది.

సినిమాల తయారీలో అమెరికా జపాన్‌ల తరువాత మూడవ స్థానం భారత దేశానిదే.

**సినిమా చూసే ప్రజ 650 లక్షల మంది:**

సుమారు 650 లక్షల మంది ప్రతివారం సినిమాలను సందర్శిస్తారు.

* * *

**ఫిల్మ్ పరిశ్రమలో పెట్టుబడి మొత్తం:**

ఫిల్మ్ పరిశ్రమలో సాలీనా పెట్టుబడి మొత్తం రూ. 3000 లక్షల రూపాయలని అంచనా.

* * *

**11,754 సినిమా థియేటర్లు:**

భారత దేశంలో 7,000 లక్షల జనాభాకి సుమారు 11,754 సినిమా థియేటర్లు ఉన్నాయి. దీని ప్రకారం ప్రతి 1000 మందికి 7.5 సీట్లు మాత్రమే ఉన్నాయి. ఇది ప్రపంచపు అన్ని దేశాలలో కంటె అతి తక్కువ. వీటిలో సుమారు 7,064 పక్కా థియేటర్లు, 4,580 తాత్కాలిక టూరింగ్ థియేటర్లు. ఇవి కాక మిలటరీ సినిమా థియేటర్లు 110 ఉన్నాయి.

* * *

**సినిమా రంగంలో పని చేసేవారు 20 లక్షల మంది:**

ఈ నాడు దేశంలో 9 వ పెద్ద పరిశ్రమగా పరిగణింపబడే సినిమా పరిశ్రమలో మొత్తం 20 లక్షలకు పైబడ్డ జనం పని చేస్తున్నారు.

* * *

**పెద్ద బడ్జెట్ సినిమాకు ఖర్చు రూ 300 లక్షలు:**

ఒక పెద్ద బడ్జెట్ సినిమాకు రూ. 300 లక్షలు ఖర్చవుతుంది. మధ్యరకం సినిమాకు బడ్జెట్ రూ. 20 లక్షలు మొదలు రూ. 30 లక్షలు. సుప్రసిద్ధ సినిమా నటుడు రూ. 10 లక్షలు మొదలు 15 లక్షలు, సుప్రసిద్ధ నటి రూ. 8 లక్షలు మొదలు రూ. 10 లక్షలు వసూలు చేసారు

---

"ఒంటరిగానున్న వృక్షమునకు చేటుగలుగును,
అనేక చెట్లలో ఉన్న చెట్టును నశింపచేయుట అసాధ్యము."

నుంచి బయటకు వచ్చి ఆ దాచిన వస్తువు లను పరీక్షించి నిద్రలేచిన తరువాత చూచిన వస్తువులను చెప్పమన్నారు. ఆ వ్యక్తులను అనేక విధాలుగా పరీక్షలు చేసారు. ఒక పరీక్షలో నాలుగు అంకెల సంఖ్య ఒకటి బీరువా మీద వ్రాసి ఉంచారు కూడా. బీరువాలో పెట్టిన వస్తువులను, నాలుగు అంకెల సంఖ్యను అన్నిటినీ కూడా వీరు పూస గుచ్చి నట్టు చెప్పి పరిశోధకులను ఆశ్చర్య చకితు లను చేసారు. ఇప్పుడు ఈ శరీరంలో నుంచి బయటికి వెళ్ళిన దేమిటి? బీరువాలో వస్తువులను చూసి తెలుసుకుని తిరిగి శరీరంలో దూరి వివరంగా చెప్ప గలిగినది ఏమిటి? అనే ప్రశ్న బయలు దేరుతుంది.

ఒక ప్రత్యేక పరిశోధనలో గుల్‌బర్గాలో ఒక ప్రొఫెసర్ గారిని నిద్రావస్థలోకి దింపి ఒక హోటలుకు దూరంగా ఉండే తన ఇంటిలో ఏం జరుగుతూందో చెప్పమన్నారు. అతడు అన్నీ చెప్పిన తరువాత అతని ఇంటికి వెళ్ళి పరీక్షించారు. అతడు చెప్పిన వన్నీ అక్షరాలా వాస్తవమని నిరూపించ బడ్డాయి. ఈ పరిశోధనలో ఒక అపూర్వ శక్తి లేక 'ఆత్మ' లేక దేహంలో ఉండే 'జీవి' శరీరంతో సంబంధం లేకుండా ప్రవర్తించగలదు అని తేలింది.

సైన్సును ఎవరూ కాదనలేకపోయినా పునర్జన్మల గురించిన అనేక ఉదంతాలు శాస్త్రజ్ఞులకు సైతం అర్థం కావడం లేదు. ప్రపంచంలో అన్ని మూలల నుంచీ ఈ పున ర్జన్మ సిద్ధాంతాన్ని బలపరచే కథ లెన్నో వింటున్నాము. అమెరికాలో జరిగిన ఒక అద్భుత విషయం ఎందరెందరో శాస్త్రజ్ఞులకు ఇంకా అర్థం కాకుండానే వుంది బ్రిన్‌స్టీన్ అనే గొప్ప వ్యాపారస్థుడు ఒక ఆమె వ్యక్తి గత సమస్యలను నిద్ర (hypnosis) ద్వారా పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నాడు. సాధారణంగా నిద్ర ద్వారా శారీరక, మానసిక సమస్యలను పరిష్కరించడానికి మనస్సును (regress) మళ్ళిస్తారు. అంటే 35 సం.ల వ్యక్తిని ఆ వ్యక్తి 30, 25 లేక 20 సం. వయస్సులో ఉండే మనస్సుకు మళ్ళిస్తారు. ఒక్కొక్కప్పుడు బాల్యావస్థ రోజులకు కూడా మళ్ళిస్తారు. స్టీన్ చేపట్టిన ఇటువంటి ప్రక్రియలో ఒక వ్యక్తి వాస్తవంగా తనకు తెలియని విషయాల నెన్నిటినో గొంతుక మార్చి చెప్పడం మొదలు పెట్టింది బ్రిన్‌స్టీన్ ఈ విషయా లన్నిటిని సంగ్రహించి పరి శీలిస్తే అవి ఆ వ్యక్తి పూర్వ జన్మకు సంబం ధించిన విషయాలు అని తెలిసింది. ఈ విషయాలను వివరిస్తూ బ్రిన్‌స్టీన్ ప్రచురించిన గ్రంథం పశ్చిమ దేశాలలో ఒక విప్లవాన్ని లేవదీసింది. అనేక విమర్శనలకు, ఆక్షేపణ లకు గురి అయింది ముఖ్యంగా క్రైస్త వులు పునర్జన్మ, దేహాంతర ప్రాప్తి అనే తాత్త్వికవిషయాలతో ఏకీభవించరు బ్రిన్‌స్టీన్ వ్రాసిన 'ది కేస్ ఆఫ్ బ్రైడీ మర్ఫీ' అనే గ్రంథంలో పూర్తిగా ఈ విషయాలన్నీ వివ రింపబడ్డాయి (సశేషం)

"ఒకడు పశువును నడిపించగా పదియొకడు

పెయ్యను నడిపింప నక్కరలేదు."

# "మా తెలుగు తల్లికి మల్లెపూదండ"

కీ. శే. శ్రీ శంకరంబాడి సుందరాచారి

**కీ. శే. శ్రీ** సుందరాచారి 'ఆంధ్రపత్రిక' కార్యాలయంలో కొంతకాలం ఉప సంపాదకులుగా పనిచేసారు. ఉపాధ్యాయుడుగా, స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగా బాధ్యతలు నిర్వహించారు. అనేక గ్రామఫోను పాటలు రచించారు. సినిమా రంగంలో 'బిల్హణ' చిత్రానికి మాటలు, పాటలు వీరు వ్రాసినవే. తేట తెలుగులో ఎన్నెన్నో ఖండ కావ్యాలు రచించారు.



వీరు 40 సం. క్రితం 'దీన బంధు' తెలుగు చిత్రం కోసం వ్రాసిన 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' నేడు ఆంధ్ర ప్రభుత్వానికి అధికార గీతం. విద్యా సంస్థలలో, సభలలో ఈ పాటను విధిగా పాడి తీరుతారు.

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మాకన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు. కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించుతూ తల్లి.

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరులుతాయి.

అమరావతి గుహల అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కన్న కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక.

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి. కృష్ణరాయలకీర్తి
మా చెవుల రింగని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!! ●

"ఎదుట వారి మనస్సు నొవ్వకుండా వారికి
ప్రియము మేలు కలుగునట్లు మాట్లాడవలెను."

# భయానికి ముఖ్యకారణం

(స్వామి చిన్మయానందతో ప్రత్యేక ఇంటర్వ్యూ)

ప్ర: ఉన్నత ఆశయాలతో సరళంగా జీవించడానికి కొన్ని సలహాలు చెప్పండి.



జ: మనస్సును అభివృద్ధి చేసుకోవాలి. ఎప్పుడూ విశాల దృక్పథం అలవాటు చేసుకోవాలి అవసరంలేని వస్తువులకు, విలాస వస్తువులకు వ్యామోహం ఉండకూడదు. మంచిని చూడు మంచిని విను మంచిని ఆలోచించు దీనివల్లే ఉన్నతాశయాలతో సరళమైన జీవితం సాధ్యమవుతుంది.

* * *

ప్ర. భయాన్ని, దిగులును పోగొట్టుకో డానికి సులభమార్గం ఉందా?

జ: ఒక వస్తువుపైన గానీ, ఒక వ్యక్తి పైన గానీ ఒకరికి గల స్వాభిమానం, మమకారం వల్లే మనస్సులో భయం కలుగుతుంది. రాత్రి పది గంటలైనా ఇంకా తమ కుమారుడు ఇంటికి రాలేదని తల్లిదండ్రులకు మనస్సులో దిగులు బయలుదేరుతుంది. మనస్సులో బయలుదేరిన ఈ వెలుపువల్లే దిగువు ఏర్పడుతుంది. ఇదే ప్రక్క ఇంటివారి కొడుకైతే వీరి మనస్సు మరోవిధంగా మారుతుంది. భయ భక్తులు లేకుండా ఆకతాయిలా తిరుగుతున్నాడు; ఇంకా ఇంటికి చేరలేదు అంటారు. 'నా ఆస్తి', 'నా ప్రతిష్ఠ'. 'నా భద్రత', 'నా కొడుకు'. 'నా వారు' అనే దానికి భంగం కలుగుతుందనే తలపువల్ల భయం, భయంవల్ల

## సాంకేతిక పదాలు

AAU అమెచూర్ ఎత్లెటిక్ యూనియన్.

AILTA: ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ అసోసియేషన్.

AHQ: ఆర్మీ హెడ్ క్వార్టర్స్.

AMIE: అసోసియేట్ మెంబర్ ఆఫ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్.

ASEAN: అసోసియేషన్ ఆఫ్ సౌత్ ఈస్ట్ ఏషియన్ నేషన్స్.

BENELUX. బెల్జియం - నెదర్లాండ్స్ - లక్సంబర్గ్ కస్టమ్స్ యూనియన్.

"పాపములు పాపఫలమునే ఇచ్చునుగాని పుణ్యఫలము నీయదు."

బిగువు ఏర్పడుతుంది జీవితంలో ఎప్పుడూ ఒక సత్రంలో దిగి మరునాడు వెళ్ళిపో తున్నాం అనే భావంతో ఉండాలి.

నీ స్వంతం నీ ఆత్మ తప్ప వేరొకటి కాదు అని అనుకున్నప్పుడు మనస్సులో నాది అనే భావం మమకారం పోతాయి.

* * *

ప్ర: మీ జీవితంలో మరపురాని అను భవం ఏమిటి?

జ: గతం గతమే. గతాన్ని గురించి నే నెప్పుడూ ఆలోచించను. గతంలో జరిగినది తిరిగి జరిగితే జరగవచ్చు. నేనెప్పుడూ అను భవ యోగ్యమైన వర్తమానాన్ని గురించే ఆలోచిస్తాను. వర్తమానాన్ని ఎంత ఉప యోగకరంగా వినియోగించుకోగలను అనే ఆలోచిస్తా. గతాన్ని గురించి ఎప్పుడూ ఆలో చించవద్దు. ముందు ఆలోచించు రాబోయే కాలాన్ని ఎలా సద్వినియోగం చేయాలో క్రమపద్ధతి ఏర్పరుచుకో అప్పుడే మనస్సు పరిపక్వం పొందుతుంది. ఆత్మకు శాంతి చేకూరుతుంది.

ప్ర. మనస్సును ఎలా అభివృద్ధి చేసుకో గలం?

జ: మనస్సు అంటే ఏమిటి? అది ఎక్కడ ఉంది? ఎవరైనా దాన్ని చూడగలరా? చూశారా? అది ఒక నదీ ప్రవాహం వంటిది. నదే నీరు. కాని నీటిని నది అని చెప్పలేం. నదికి కాలువలు త్రవ్వి వివిధ ప్రదేశాలకు లాభసాటిగా వినియోగపరచుకుంటాం. నది లోకి కాలుష్యాలు చేరకుండా జాగ్రత్తపడితే నదిని స్వచ్ఛంగా తేటగా ఉంచగలుగుతాం.

అలాగే మీ మనస్సు దురాలోచనలతో నిండి పోతే చేసేపనులు కూడా అయోగ్యమైనవిగా పరిణమిస్తాయి. మనస్సులో మంచిని పెంపు కొంటే చిత్తస్థైర్యం ఏర్పడుతుంది. దురా లోచనలతో మనస్సులో చెడు ఆలోచనలు పెంచుకుంటే మంచి పనులు చేయలేరు. సద్భావాలు కలుగవు. ఇదంతా నెమ్మదిగా జరిగేది. వెంటనే జరిగిపోయేదికాదు. మన స్సులో మంచి భావాలు ఉద్భవించడానికి తిరిగి

## సత్యంలో సత్యం గ్రహించు



సత్యంలో అసత్యాన్ని భావించేవారు, అస త్యాన్ని సత్యంలో దర్శించేవారు సత్యాన్ని ఎన్నడూ పొందలేరు. శుష్కమైన వాంఛలనే అనుసరిస్తారు. సత్యంలో సత్యాన్ని, అస త్యంలో అసత్యాన్ని తెలుసుకున్నవారు మాత్రమే పరమ సత్యాన్ని గ్రహించ గలిగి వాస్తవమైన కోరికలను అనుసరిస్తారు.

—'ధమ్మపద'

"రోగికి పథ్యమైన ఆహారం విషముగా తోచును."

తిరిగి ప్రయత్నం చేయాలి. అప్పుడు మనస్సు పరిపక్వం చెందుతుంది.

* * *

ప్ర: పాఠశాలలోనూ, కళాశాలలోనూ నీతి పాఠాలు తప్పనిసరిగా చెప్పాలా?

జ: పిల్లలకు పాఠశాలలోనూ, కళాశాలలోనూ నీతిశాస్త్రం తప్పనిసరిగా ఎప్పుడూ చెప్పకూడదు ఉపాధ్యాయులు విద్యార్థులకు కథల మూలంగా నీతిని ఉపదేశించడానికి వీలుగా ఉపాధ్యాయులకే నీతి పాఠాలు అవసరం. వినడంకంటే దృశ్య సాధనాలద్వారా పాఠశాలా విద్యార్థులు ఎక్కువ గ్రహించ గలుగుతారు. టీ వీ., స్లైడ్సు మొదలైన దృశ్య సాధనాల ద్వారా తెలుసుకోడానికి పిల్లలకు అవకాశం కల్పించాలి. రాత్రి పడుకునే ముందు పిల్లలకు పురాణ గాథలు. వీరుల చరిత్రలు, స్వాతంత్ర్య సమరయోధుల గాథలు చెప్పవచ్చు. ●

## అభివృద్ధికి ఎప్పుడూ అవకాశం ఉంటుంది



నువ్వు అనుకునేదే సరైనదని, ఇతరులు అనుకునేది తప్పు అని ఎప్పుడూ అభిప్రాయ పడకు ఏ విషయాన్నైనా సంపూర్ణంగా అవగాహన చేసుకుని అందులో ప్రావీణ్యాన్ని పొందడానికి మానవుడికి ఒక జీవిత కాలం చాలదు. జ్ఞానాభివృద్ధి చేసుకోడానికి ఎప్పుడూ అవకాశం ఉంటూనే ఉంటుంది. ఎప్పటికప్పుడే క్రొత్త విషయాలు నేర్చుకోడానికి, అభ్యసించడానికి వెనుకాడకూడదు. కాబట్టి వినడానికి, నేర్చుకోడానికి సిద్ధంగా ఉండు అంతా తనకే తెలుసుననే అహంకారం, దురభిప్రాయం వదలుకుని భార్య నోరు తెరవమని పరిశీలించి ఉంటే గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ ఆడవారి నోట్లో దంతాలు తక్కువగా ఉంటాయనే తప్పుడు నిర్ణయానికి వచ్చి ఉండడు. మనకే బాగా తెలుసు అని అభిప్రాయ పడటం తప్పు.

ఒకవేళ నీ అభిప్రాయమే సరి అయినదని అనుకున్నప్పుడు ఇతరుల అభిప్రాయాలకు ఎందుకు అంత కోపం? రెండు రెండు ఐదు అని ఎవరైనా అంటే ఏం పోయింది. అయ్యో పాపం ఈ చిన్న విషయమే తెలియదే అని విచారించవచ్చు కదా! వివేకం, విజ్ఞానం విషయంలో మాత్రం ప్రతి పైసా కూడబెట్టుకునే మహా లోభిగా వ్యవహరించు. ఎంత ఉన్నవాడికైనా ఇంకా కావాలి అనుకుంటాడు. నేర్చుకోడంలో నీవు ఎంత ఎక్కువగా నేర్చుకున్నా ఇంకా ఇంకా నేర్చుకోడానికే ప్రయత్నించు.

# అవీ-ఇవీ

## మొట్టమొదటి ఎడారి ఔషధ పరిశోధక కేంద్రం:

రాజస్థాన్ ప్రభుత్వం మరియు ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చికేంద్రం కలిపి దేశంలోనే మొట్టమొదటి సంస్థ అని చెప్పుకో



దగిన ఎడారి ఔషధ పరిశోధక కేంద్రాన్ని జోధ్‌పూర్‌లో ఏర్పాటు చేస్తున్నారు. ఇక్కడ ముఖ్యంగా ఎడారి ప్రదేశాలకు సంబంధించిన ప్రత్యేక ఆరోగ్య సమస్యలను, కాలువనీటి సాగుబడితో ఎడారి అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన సమస్యలను అధ్యయనం చేస్తారు.

* * *

## కృత్రిమపాదంతో సైకిల్ త్రొక్కవచ్చు:

మాంచెస్టర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీలో పోలిమర్ సైన్సెస్ విభాగానికి చెందిన రిచర్డ్ డాబెర్ క్రొత్త కృత్రిమ పాదాన్ని కనిపెట్టాడు. ఈకృత్రిమ పాదంతో ఇతర కృత్రిమ పాదాలతోకంటె మోకాలును అతి సౌలభ్యంగా వంచడానికి వీలవుతుంది. దీంతో సైకిలును అవలీలగా తొక్కవచ్చు

* * *

## తమిళనాడులో సాంస్కృతిక పురావస్తు శాల:

తమిళనాడు ప్రభుత్వం రూ. 5 లక్షల వ్యయంతో ఒక సాంస్కృతిక పురావస్తు శాలను ఏర్పరచదలచుకున్నారు. ప్రాచీన కాలంలో తమిళులు వాడిన నాణాలు, పాత్రలు, ఆనాటి అపూర్వ కళాఖండాలు వగైరా ఇక్కడ ప్రదర్శింపబడతాయి. ప్రాచీన సంగ వాఙ్మయంలో చెప్పబడ్డ పువ్వులు, మొక్కల

(మిగతా 32 వ పేజీలో)

## వోటువేసిన 128 సం.ల వృద్ధురాలు

1984 లోకసభ ఎన్నికలలో తన్‌హూ బాయి మల్‌హరి ఇంగ్వాలె అనే 128 సం.ల వృద్ధురాలు పూనా (మహారాష్ట్ర) బొపొడిలో రాజేంద్రప్రసాద్ ప్రైమరీ పాఠశాలలో వోటు వేసి తన హక్కును కాపాడుకుంది.

"జ్ఞాతులు వివేకహీనులైనప్పటికీ వారలను విడువకూడదని శాస్త్రము."

# 'ఆదిగ్రంథ్' అవతరణ

భారత దేశపు పవిత్ర గ్రంథ శ్రేణికి చెందిన ఆదిగ్రంథ్ ఈనాడు ప్రపంచపు పవిత్ర గ్రంథాల జాబితాలో చేరింది. శిక్కులు దీనిని పరమ పూజ్యమైన గ్రంథంగా భావిస్తారు. భగవద్గీత ఇతర ఆధ్యాత్మిక గ్రంథాలతోబాటు హిందువులు కూడా ఆదిగ్రంథ్‌ను పఠిస్తూ ఉంటారు.

పంజాబ్ అమృతసర్‌లో గురు అర్జున్ ఆదిగ్రంథ్‌ను 1604 వ సం.లో క్రోడీకరించాడు. దీని రెండవ మరియు చివరి కూర్పును 1705 వ సం. లో గురుగోవింద్ సింగ్ పూర్తి చేసాడు. ఆదిగ్రంథ్‌లో గురునానక్, గురు అంగద్, గురు అమరదాస్, గురురామదాస్ రచనలు, తన రచనలు హైందవ భక్తుల రచనలు, ముస్లిం దర్వీషుల రచనలు మొత్తం 5756 పద్యాలు సేకరింపబడ్డాయి. గురు గోవింద్ సింగ్ తన తండ్రి అయిన గురుతేజ్ బహదూర్ 115 రచనలను కూడా చేర్చి మొత్తం 5871 పద్యాలను సేకరించాడు.

ఆదిగ్రంథ్‌లో భాష సామాన్యంగా వీధులలోను, గృహాలలోనూ, మార్కెట్లలోనూ మాట్లాడుకునే వాడుకభాషలో ఉంటాయి. జానపద రీతిలో వ్రాయబడిన ఈ పాటలు దివ్యవాణిగా పరిగణింప బడతాయి. భగవంతుడు గుణాతీతుడు. సర్వాంతర్యామి అని శిక్కుల నమ్మకం. వీరు ముఖ్యంగా వైష్ణవ సిద్ధాంతాలను నమ్మినట్లు ఆదిగ్రంథ్‌లో సేకరింపబడిన రచనలవల్ల తెలుస్తుంది. శిక్కులు వైష్ణవ సాంప్రదాయాన్ని అనుసరించినా బహుదేవతా తత్త్వాన్నిగానీ, విగ్రహారాధననుగానీ వీరు అంగీకరించలేదు. ఆదిగ్రంథ్‌లో అద్వైతవాది కబీర్ రచనలుకూడా చేర్చబడ్డాయి.

మత సాంఘిక సామరస్యంతోపాటు భిన్నత్వంలో ఏకత్వమనే భారతీయ జీవన విధానం ఆదిగ్రంథ్‌లో పొందుపరచబడింది. ●

## ప్రపంచంలో సుప్రసిద్ధ మతాలు (1984)

| | |
|---|---|
| బౌద్ధులు | —246 000.000 |
| క్రైస్తవులు | —1,000.000,000 |
| రోమన్ కాథలిక్‌లు | —665.000,000 |
| ప్రొటెస్టెంట్‌లు | —324,000,000 |
| ఈస్టర్న్ ఆర్థోడాక్స్ | —82 000,000 |
| కన్‌ఫ్యూషియోనిజమ్ మరియు టావోఇజమ్‌కు చెందినవారు | — 305 000.000 |
| హిందూ మతస్థులు | — 600,000 000 |
| ఇస్లాము మతస్థులు | – 700 000,000 |
| జ్యూదు మతస్థులు | —15,000.000 |
| షింటాయిజమ్ మతస్థులు | —63 000,000 |

"పెద్దలు లేని సభ అది సభ కానేరదు.
ధర్మవిచారణ చేయని జనులు పెద్దలుకారు."

# బాల్ పాయింట్ పెన్

వ్రాత సాధనంగా బాతుకలాల తరువాత 1809 సంవత్సరంలో ఉక్కు పాళీలు, ఇత్తడి పాళీలు కనుగొనబడ్డాయి. రకరకాల



ఫౌన్‌టెన్ పెన్నులు కూడా వచ్చాయి. క్రొత్త బాల్ పాయింట్ పెన్‌తో వ్రాత సాధనాల పరిశ్రమలో ఒక గొప్ప విప్లవం బయలు దేరింది. మానవలోకాన్ని ముగ్ధ పరిచేస్తూంది ఈ బాల్ పాయింట్ పెన్.

మొట్టమొదట అసలు బాల్‌పాయింట్ పెన్ 1888 వ సం.లో పేటెంట్ కావింపబడింది. జె. జె. లాడ్ అను ప్రముఖుడు దీన్ని కనిపెట్టి రూపొందించాడు ఆనాడు ఇది సరకుల పెట్టెలమీద వ్రాసే మోటు వ్రాత పనులకు ఉపయోగపడే వ్రాత సాధనంగా రూపొందింది.

యుద్ధసమయంలో అత్యవసర పరిస్థితులలో ఎక్కడ పడితే అక్కడ ఎప్పుడుబడితే అప్పుడు ఉపయోగించుకోడానికి. సౌకర్యంగా ఉండటానికి దిట్టమైన పెన్ను కావలసి వచ్చింది. ఆ అవసరాన్ని బట్టి యుద్ధ సమయంలో ఆధునిక బాల్‌బాయింట్ పెన్ తయారు చేయవలసిన సమస్య తీవ్రమైంది. 1943 వ సం లో ఈ క్లిష్ట సమస్యను ఎదుర్కొని ఒక పరిష్కార మార్గం కనిపెట్టి దిగ్విజయాన్ని సాధించిన ఘనత చికాగోకు చెందిన మిల్టన్ రెయ్‌నాల్డ్స్‌కు దక్కింది. ఇతడు కనిపెట్టిన పెన్‌ల ఒక చివర అమర్చిన ఒక చిన్న 'మి మీ గుండ్రని బంతి పంటి మైన ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన పల చటి ద్రవ రూపపు సిరా సంపర్కంతో కదులుతూ ఉంటుంది వెంటనే అమెరికా ప్రభుత్వంవారు యుద్ధంలో సైనికులకు ఉపయోగార్థం వేలకొలది రెయ్‌నాల్డ్స్ పెన్నులను ఇచ్చారు.

అదే సమయంలో దక్షిణ అమెరికా అర్జెంటీనాలో ఆర్థిక స్తోమత లేని హంగే

---

## 'హాట్‌లైన్' అంటే

అకస్మికంగా సంభవించే యుద్ధాన్ని నివారించడానికి అమెరికా అధ్యక్షుడు మరియు రష్యా ప్రధాన మంత్రికి మధ్య డైరెక్ట్ టెలిఫోను లింకును 'హాట్ లైన్' (Hotline) అంటారు.

"వ్యసనముచేత దేహబలము తగ్గును. రూపము చెడును,
బుద్ధిహీన మగును, రోగము సంక్రమించును."

రియా కాందిశీకుడు లాస్ జ్లోబైరో తన స్వంత ఉపయోగం కోసం అప్పటికి నాలుగు సంవత్సరాల ముందే సన్నపాటి గొట్టంలో సిరా నింపి ఒక బాల్‌పాయింట్‌ను అమర్చి, క్రొత్త వ్రాత సాధనాన్ని ఏర్పరచుకొని ఉపయోగించుకుంటున్నాడు.

హెన్రీ మార్టిన్ అనే ఆంగ్లేయుని దగ్గర కొంత డబ్బు తీసుకుని బైరో తాను కని పెట్టిన విధానాన్ని అతడికి అమ్మాడు ఫ్రెడ రిక్ మైల్స్ అనే వ్యాపారస్తునితో మార్టిన్ చేరి జాయింటుగా ఇంగ్లండులో చిన్న పెన్నుల ఫాక్టరీని నెలకొల్పి రాయల్ ఎయిర్ ఫోర్స్‌కి సిరా కారని పెన్నులు రెండవ ప్రపంచయుద్ధ సమయంలో తయారుచేయడం ప్రారంభిం చాడు. ఇంతలో యుద్ధం నిలిచి ప్రపంచంలో శాంతి ఏర్పడింది. మార్టిన్స్ కంపెనీ విరి విగా బాల్‌పాయింట్ పెన్నులు తయారీకి ప్రారంభించింది.

ఈ సమయంలో బిఐసి (BIC) అనే ఫ్రెంచి కంపెనీ ఇంకా చౌకగా విశిష్ట రకం పెన్నులు కనిపెట్టింది. ఒకసారి ఉపయో గించుకున్న తరువాత ఈ బాల్‌పాయింట్ పెన్ నిరుపయోగమైపోతుంది తిరిగి సిరా నింపడం, రిపేరు అనే బాదరబందీలు లేకుండా దాన్ని పారవేసి మరో క్రొత్త పెన్నును కొనుక్కునే రకం పెన్నులు ఇవి. ఈ కంపెనీ మార్టిన్‌కు కొంత ధనమిచ్చి అతడి కంపెనీని కూడా కొనుక్కుని పేటెంట్ చేసి పెన్నులు తయారుచేయడం ప్రారంభించారు.

ఎటువంటి వాతావరణంలోనైనా వ్రాయ గల మంచి సాధనమని దీనికి అమెరికాలో మంచి గిరాకీ బయలుదేరింది. ఒక్క బ్రిటను లోనే ఇప్పుడు సంవత్సరానికి 17,000,000 మొదలు 150,000 000 పెన్నులు అమ్ము డవుతున్నాయి. ప్రప్రథమంలో ఈ పెన్ను లలో ఉన్న సిరా ఆరిపోతూండడం, ముద్దలు ముద్దలుగా వ్రాయడం, రాస్తూ రాస్తూ మధ్యలో ఆగిపోవడం వంటి లోపాలన్నీ సవరింప బడ్డాయి. పూర్తిగా సరిక్రొత్త రకం ప్రత్యేక మైన సిరా కనుగొనబడింది. గ్లిసరిన్ ద్రవంలో కృత్రిమ వర్ణం కలిపి చేసిన ఈ సిరాతో వ్రాసిన లిఖిత గ్రంథాలు 200 సంవత్సరాల దాకా చెక్కుచెదరకుండా స్పష్టంగా ఉంటాయి. వ్రాసిన విషయాలు చెరిగిపోయి మాసిపోతాయనే భయంతో బాల్ పాయింట్ పెన్‌తో వ్రాయడం చట్టవిరుద్ధ మన్న నిబంధన సడలింప బడింది. ●

---

(29 వ పేజీ తరువాయి)

ప్రవృద్ధికి రూ. 50,000ల వ్యయంతో ప్రత్యేక తోటలు కూడా నిర్వహించపడలచారు.

* * *

బదరీనాథ్ దేవాలయానికి రక్షణ

స్నో అండ్ అవలాంఛ్ స్టడీ ఎస్టాబ్లిష్ మెంట్ (Snow and Avalanche study Establishment) కు చెందిన వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు ఉత్తరప్రదేశ్‌లోని బదరీనాథ్ దేవాలయాన్ని రక్షించడానికి డామ్ నిర్మిస్తున్నారు. గతంలో అనేక పెద్ద పెద్ద హిమానీ నదులవల్ల (major avalanches) దేవాలయం చుట్టుప్రక్కల అనేక ఇళ్ళు భవ నాలు కూలిపోయాయి ●

"సాధారణ విషయాలను మహాద్భుతంగా కొనసాగించడం నైపుణ్యం."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/ లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. నాగలక్ష్మి ఎల్. డి. పి., D/o హరిహర శర్మ, ఇం. నెం. టి ఆర్ టి 72, శక్కర్ నగర్, నిజామాబాద్-503 180.
ఉద్యోగ ధర్మం, లెనిన్ రచనల పఠనం.

2 ఎమ్ విజయభాస్కర్, 23 సంవత్సరాలు, బి ఏ, గరికిపాడు, రాజాం తాలూకా, (శ్రీకాకుళం జిల్లా)
కథలు వ్రాయడం, చిత్రలేఖనం, ప్రకృతి ఆరాధన.

3. వి వినోదరావు, 24 సం లు, బి.ఏ., వేంకటాపూర్ వేములవాడ తాలూకా, (కరీంనగర్ జిల్లా) 505 301.
ఫొటోగ్రఫీ, చిత్రలేఖనం, నవలాపఠనం.

4. కె ప్రేంసాగర్ రావు 25 సం.లు, ఎల్ ఇ ఇ, ఇం నెం. 7-1-2. బస్ స్టాండ్ రోడ్, సిరిసిల్లా, (కరీంనగర్ జిల్లా) 505 301
రేడియో వినడం, క్రికెట్ కామెంటరీ వినడం. చిత్రలేఖనం.

5. ఎస్. లింగారెడ్డి, 18 సం లు, ఇంటర్, S/o వెంకటరెడ్డి, పాపటపల్లి పోస్టు, (ఖమ్మం జిల్లా).
చిత్రలేఖనం, కలం స్నేహం.

## నా సాపేక్ష సిద్ధాంతం నిజం అని నిరూపిసే



నా సాపేక్ష సిద్ధాంతం నిజం అని నిరూపిసే జర్మనీ నన్ను జర్మనీ దేశస్థుడు అంటారు ఫ్రాన్స్ ప్రపంచ దేశస్థునిగా ప్రకటిస్తారు కాదని నిరూపించబడితే ఫ్రాన్స్ నన్ను జర్మన్ అంటారు. జర్మనీ జ్యూ క్రింద లెక్క కడతారు.

—ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

"లోకములో ముఖప్రీతికి మాటలాడెడి వారంతటను గలరు.
మేలు కలిగెడి మాటలు వారల కయిష్టముగా నున్నప్పటికిని చెప్పెడివారు లేరు."

# మీరు సమర్థులేనా?

డా. క్లైవ్. డి. హర్లీ

నిర్ణయించుకున్న ఒక పనినిగానీ, కార్యాన్ని గానీ సాధ్యమైనంత వరకు అనుకున్న ప్రకారం ఆలస్యం లేకుండా సకాలంలో మాట తప్పకుండా వ్యయప్రయాసలు



లేకుండా అతి పొదుపుగా చాకచక్యంగా చక్కదిద్దడం 'సామర్థ్యత' అనిపించు కుంటుంది. సామర్థ్యత అనే పదంలో క్రింద సూచించే లక్షణాలన్నీ ఇమిడి ఉంటాయి

1. విశ్వాసం - మాట దక్కించుకో వాలి: చెప్పినపని చేయకపోతే ఆ వ్యక్తిలో సామర్థ్యత లోపించిందనే అర్థం. ఎంతమందిని చూడడంలేదు? తెల్లవారి లేస్తే ఇంటాయన పనిచేసేదాంతో, కూర గాయల వాడితో, మెకానిక్‌తో, ఎలక్ట్రిషి యన్‌తో, ప్లంబర్‌తో, ఎవరితోటో ఒకరితో టైముకు రాలేదనో, సరిగా పనిచేయలేదనో, ఆలస్యమైందనో దెబ్బలాడటం సహజం. మర్యాద లేదని, లక్ష్యం లేదని నిందిస్తారు. ఇటువంటి అవకాశాలకు తావు ఈయకుండా మంచి నమ్మిక, విశ్వాసం కలిగేటట్లుగా కార్యాలు సాధించాలి. మాట దక్కించుకోక పోతే జన్మలో మిమ్మల్ని ఇక నమ్మరు.

2. దుర్వ్యయం: సామర్థ్యత అన్నప్పుడు మరో ముఖ్య విషయం—కాలం. ద్రవ్యం, శక్తి మొదలైన వాటిలో పొదుపు పాటిం చాలి అన్నివిధాలా లాభసాటిగా పనులను కొనసాగించాలి ఒక పనిని చేసేటప్పుడు, ఇది అవసరమా? దీనికి మరోమార్గం లేదా? ఇంతకంటే సౌలభ్యంగా దీనిని చేయగలమా?

## కంప్యూటరు ఆధారంతో వివరాలు

రాజస్థాన్ పిలానీలో శాస్త్రజ్ఞులు కంప్యూ టరు ఆధారంతో సమాచారం తెలుసుకొనే విధానాన్ని అభివృద్ధి పరిచారు కంప్యూ టరును ఉపయోగించేవారు ప్రత్యేక హిందూ స్థానీ రాగం పేరును కంప్యూటరులో పంపిస్తే వీడియో స్క్రీనుమీద వివిధ సినీమాలనుండి, ఆ ప్రత్యేక రాగంమీద ఆధారపడిన పాటలు అన్నీ ప్రదర్శింపబడతాయి.

"విరోధము ప్రయత్నపూర్వకముగా కోరరాదు."

అనే ప్రశ్నలకు జవాబులను వివేకవంతంగా పరిశీలిస్తూ ఉండాలి. ప్రతినిత్యం మీరు చేసే ప్రతీ పనికి ఈ ప్రశ్నలను అనువర్తించు కుంటే ఉత్పాదక శక్తి ప్రవృద్ధి పొందుతుంది. ఫలసాయం అధికం అవుతుంది. దేనిలోను దుర్వ్యయం ఉండదు. ఇటువంటి విమర్శా త్మక బుద్ధివల్ల సమర్థత పెరుగుతుంది. గౌరవం హెచ్చుతుంది. వ్యాపారం అభివృద్ధి కరంగా కొనసాగుతుంది

3. కాలనియమాన్ని పాటించాలి: వాస్తవంగా సమర్థుడైనవాడు ప్రతీ పనిని ఒక



పద్ధతిని అనుసరించి సక్రమంగా, అతివేగంగా, సునాయాసంగా ఒడుపుతో చేయాలి. హడా విడిగా చేసే పని నిరర్థక మవుతుంది. ఆల స్యంగా వస్తే మర్యాదకు లోపం అనుకుం టాడు చాలా ముందుగానే వచ్చేసి అమూల్య మైన తన కాలాన్ని వ్యర్థం చేసుకోడు. కార్య క్రమాలను సక్రమంగా నడుపుకుంటూ నియ మంగా నిష్ఠగా ఉంటాడు. కాల నియమాన్ని పాటిస్తాడు. ఆలస్యంగా వచ్చేవారిమీద ఎవ్వ రికీ మంచి అభిప్రాయం ఉండదు. అటువంటి వారు సమర్థులని ఎవ్వరూ అనరు.

4. నిర్ణయాలు వాయిదా వేయ కూడదు: చేస్తానని చెప్పిన పనులు తప్ప కుండా వెనువెంటనే చేయడం సామర్థ్య వంతుని మరోగుణం. చాకచక్యంగా, అతి వేగంగా, హుందాగా భావనాశక్తితో, ఆత్మ విశ్వాసం ధ్వనిస్తూ చేస్తాడు. తన పనులుగాని, ఇతర పనులుగాని చేసే పనులకు కాల నియమాన్ని నిర్ణయించుకుంటాడు. దాని ప్రకారం కొనసాగింటుకుంటాడు. ఆహ్వానా లను అంగీకరిస్తాడు. పిలుపులను గౌర విస్తాడు. ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడు ముగిస్తాడు. అసలు మీరు సమర్థ లుగా ఉండాలంటే ఎవరైనా అడిగినప్పుడు, అర్థించినప్పుడు, ఆహ్వానించినప్పుడు సిద్ధంగా అంగీకరించాలి. అడినమాట నిలబెట్టుకోవాలి. నిర్ణయాలు వాయిదా వేయకూడదు.

5. పొరపాటు లేకుండా చూసుకో వాలి: ఎక్కడా ఏ పొరపాటు రాకుండా జాగ్రత్తపడటం అనేది సామర్థ్యవంతుడికి ఉండవలసిన ముఖ్య గుణం. చేసిన పనిని సరిచూడడం, రెండవసారి సరిచూడడం అటు

---

## ముక్కుకు బీమా!

సుప్రసిద్ధ హాస్యనటుడు జిమ్మీ డ్యూరా-న్ట్స్ (Jimmy Durants) తన ముక్కును 1,40,000 డాలర్లకు భీమా చేయించు కున్నాడు.

---

"స్నేహము, సంభాషణము, ఓరిమి, కలహము, విరోధ కార్యములు చేయుట, ధర్మవిచారణము అను ఆరు కార్యములు తనతో సమానమైన వారితో చేయవలయును."

వంటి వారి అభ్యాసం. దీనివల్ల వదలిపెట్టడం గానీ, పొరపాటుగానీ జరుగదు. ఎక్కడైనా, ఎప్పుడైనా అనుమానం తగిలితే నిఘంటు



వును. రిఫరెన్స్ పుస్తకాలను చూడడానికి బద్ధకించదు

6 పొందిక: వస్తువులను సర్దుకోకుండా చిందరవందరగా పడేసుకుంటే ఎన్నో వస్తువులు పోతాయి కావలసిన వస్తువులు వెతుక్కోడంతోటే కాలయాపన అయిపోతుంది. సామర్థ్యంగా ఉండాలంటే ఇంట్లోనేకాదు, పాఠశాలలో, ఆఫీసులో ఒక సవ్యమైన విధానాన్ని అనుసరిస్తూ వస్తువులను సర్ది పెట్టుకోవాలి అందంగా అమర్చి పెట్టుకోవాలి. డ్రాయర్లు పెట్టెలు, అల్మైరాలు మొదలైన వాటికి లేబిల్స్ అతికించుకోవాలి. కాగితాలు, జాబులు సకాలంలో సక్రమంగా పెలు చేసుకోడం అలవాటు చేసుకోవాలి.

7. జ్ఞాపకశక్తి: అసలు విషయాలను మరచిపోతాం అనవసర విషయాలను జ్ఞాపకం పెట్టుకుంటాం. వ్యక్తిగతంగా సామర్థ్యతను పెంపొందించుకోవాలంటే అన్ని ముఖ్య విషయాలను వివరంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. సృజనాశక్తిని అభివృద్ధి చేసుకోవాలి. ఇది ప్రయత్నం మీదే ఆధారపడుతుంది.

8. స్వచ్ఛమైన వాక్కు: మాటలు మ్రింగివేయకూడదు. నంగినంగిగా మాట్లాడితే మనం చెప్పేది ఇంకొకరికి అర్థంకాదు దాని వల్ల శ్రద్ధ చెడిపోతుంది అపార్థాలు. అపోహాలు బయలుదేరి పోట్లాటలకు దారితీస్తుంది.

మాట్లాడే ప్రతిమాట గటిగా స్వచ్ఛంగా పూర్తిగా అన్ని శబ్దాలు స్పష్టంగా పలకాలి. స్పష్టంగా పలుకుతూ గట్టిగా చదవడం అభ్యాసం చేసుకుంటే ఉచ్చారణ అభివృద్ధి పొందుతుంది

9. తేటగా స్పష్టంగా వ్రాయాలి: మన మనోభావాలు, ఉద్దేశాలు ఇతరులకు తెలియడానికి మనం వ్రాస్తాం. ఇష్టమొచ్చినట్టు వ్రాస్తే ఇతరులు ఎవ్వరూ చదువలేరు టైపు చేయడం ఉత్తమం. లేకపోతే వ్రాసేటప్పుడు ప్రతి అక్షరం ముత్యంలా తీర్చిదిద్దాలి. మనో నిశ్చయంతో, పట్టుదలతో ప్రతి రోజూ అభ్యాసం చేసుకుంటే మంచి దస్తూరి అలవాటు చేసుకోడం కష్టంకాదు.

10. రూప సౌందర్యం: మనం సామర్థ్యంగా కనిపిస్తే మనం సామర్థ్యంగానే ఉంటాం. అందంగా, హుందాగా దుస్తులు ధరించాలి. ఠీవిగా నడవాలి. అప్పుడే వ్యక్తిత్వం ప్రభవిస్తుంది. ఆత్మవిశ్వాసం ధ్వనిస్తుంది నడవడిలో. చేతలలో హుందాతనం, గొప్పతనం ప్రకటితమవుతుంది. సమర్థత మూర్తీభవిస్తుంది. ●

"పుష్పమందలి మకరందమును తుమ్మెదలు త్రాగునట్లు
కార్యసిద్ధి కొరకు ఎదుటివారి మనస్సును నొప్పించకూడదు."

# పువ్వులరాణి-రోజా

అనేక వేల సంవత్సరాల నుంచీ రోజాపువ్వు మానవుణ్ణి ముగ్ధపరుస్తూంది. మోహంలో



ప్రేమకూ, సౌందర్యానికీ గ్రీకుల అధిదేవతైన అఫ్రొడైట్ (Aphrodite) కు సంబంధించినదన్నారు. గ్రీకుల మన్మధమూర్తి ఈరోస్ (Eros) కు సంబంధించినదన్నారు. గులాబీ (రోజా) పువ్వుల రేకులు సమాధులపై జల్లేవారు. రోమనుల ఉత్సవాలలో, పండుగలలో గులాబులతో అలంకరించుకునేవారు. యుద్ధభూమినుండి దిగ్విజయంతో వచ్చే సైన్యాధిపతుల రథాలను రోజాలతో అలంకరించేవారు.

క్రైస్తవమతం ప్రసిద్ధితో రోజాపూవు మేరీకన్యకు (Virgin Mary) చెందిన కుసుమంగా మారింది రోమన్ కాథలిక్కులు ప్రార్థనాసమయంలో రోజాపువ్వుల సువాసనలు వెదజల్లే జపమాల సెంట్. దోమనిక్‌కి వర్జిన్ మేరీ ఇచ్చింది.

రోజాలు అనేక శతాబ్దాలనుండీ ఔషధాలలో ఉపయోగిస్తున్నారు. యునానీ వైద్య విధానంలో సుప్రసిద్ధమైన 'గుల్‌కంద్' గులాబీ పూవులరేకులతో తయారు చేసిన లేహ్యం. 17 వ శతాబ్దంలో రోజా అత్తరు వును చేసి మానవుడు కృతార్థుడయాడు ఒక పౌను అత్తరు తయారుచేయడానికి సుమారు 10 000 పౌన్ల గులాబీపువ్వుల రేకులు కావలసి ఉంటుంది. గులాబీ రేకులు తమ శరీరాన్ని నిత్యయౌవనంతో ఉంచుతాయని ప్రాచీన రోము మహిళల నమ్మిక గులాబీ గులాబీరంపులను ఆలివ్ నూనెతో తీసి పన్నీరు తయారు చేస్తారు. నేటికీ పన్నీరు బాగా దొరుకుతూంది దీన్ని కళ్ళు శుభ్రం చేసుకోడానికి, వంటకు వాడతారు. చెట్లలో అర విడిచిన గులాబీపువ్వుకు ఉండే సొగసు, రంగు, సువాసనలవల్లే దానికంత మోజు. పన్నీరు ఈ పువ్వునుండి తయారవుతుంది కాబట్టే దీన్ని 'పన్నీరు పువ్వు' అని కొందరంటారు. ఈ పన్నీరుపూవు 'పాలనేరు' అయి ఉండాలి. (రోజాలలో ఎర్రని రోజా అనే రకమే పాలనేరు, లేత గులాబీ వర్ణంతో ఎక్కువ సువాసనతో తక్కువ కాలముండే గులాబీరకం) ఈనాడు రోజా పూవులలో లెక్కలేనన్ని రకాలు ఉన్నాయి. ●

---

"అనంత కేంద్రాలతో పరిధిలేని వృత్తమే పరమాత్ముడు."

# జాతీయ వార్తలు

## అభివృద్ధి పరచిన ఆధునిక ఖగోళము:

ఉత్తరప్రదేశ్ వారణాశి (బెనారస్) లో రూ. 35 లక్షలు విలువ చేసే GX—S ఖగోళము (ప్లానెటోరియం) ఏర్పాటు చేయబడు



తుంది. దేశంలో నెలకొల్పబడిన 13 ఖగోళాలలో అధునాతనమైన ఈ ప్లానెటోరియాన్ని జపాను రూపొందించింది.

• • •

## రాజస్థాన్ నుండి సోలార్ కుక్కర్:

రాజస్థాన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మాజీ చెయిర్‌మన్ మరియు రాష్ట్ర పి. డబ్ల్యు. డి. మాజీ చీఫ్ ఇంజనీర్ అయిన శ్రీహరిదత్ గుప్త రూపొందించిన సౌరపాచని (Solar cooker) మార్కెట్‌లోకి వచ్చింది వేసవి కాలంలో ఐదుమంది కుటుంబ సభ్యులుండే ఒక చిన్న కుటుంబానికి ఒకటిన్నర గంటలలో నాలుగు రకాల వంటకాలను ఈ సోలార్ కుక్కర్ సిద్ధం చేయగలదు.

• • •

## బొగ్గు గనులను తెలుసుకోడానికి క్రొత్త సాంకేతిక మార్గాలు:

హైదరాబాద్‌లో జాతీయ భూ భౌతిక పరిశోధక సంస్థలో విజ్ఞాన శాస్త్రజ్ఞులు అభివృద్ధి పరచిన 'డీప్ సెసిమిక్ సౌండింగ్' అనే క్రొత్త సాంకేతిక సాధనం పశ్చిమ భారత దేశంలో ఉజ్జయిన్ - నేపానగర్, మహాన్ ప్రదేశాలలో బొగ్గు స్థావరాలను తెలుసుకోడానికి ఉపయోగపడుతుంది.

## సినిమాలో చివరి సీను!

డైరక్టరు: ఇప్పుడు నువ్వు నాలుగో అంతస్థు నుంచి దూకాలి.

నటుడు: అమ్మో! క్రిందపడి చచ్చిపోతాను బాబో!

డైరక్టరు: పరవాలేదు. సినిమాలో ఇది చివరి సీనే కదా!

"పాత పొరపాట్లను సమర్థించి క్రొత్తవాటిని తెచ్చిపెడుతుంది కాలం."

## చెవిటి వారికి బొమ్మల నిఘంటువు :

భారత దేశంలో తొలిసారిగా చెవిటి పిల్లల ప్రాథమిక విద్యకు ఒక బొమ్మల నిఘంటువు, రెండు అభ్యాస పుస్తకాలు, ఒక మాట్లాడటం నేర్పే వాక్‌బోధిని ప్రచురింప బడ్డాయి. మొత్తం నాలుగు పుస్తకాల ఖరీదు రూ. 81/-లు.

* * *

## ఇథైల్ ఆల్కహాల్ ప్రాతిపదికగా ఆసియాదేశపు మొట్ట మొదటి ఎసిటోన్ ప్లాంటు :

మహారాష్ట్ర సాంగ్లిలో ఇటీవల ఇథైల్ ఆల్కహాల్ ప్రాతి పదికగా ఆసియా దేశపు మొట్టమొదటి ఎసిటోన్ ప్లాంట్ ప్రారంభింప బడింది. రూ. 3.5 కోట్లు విలువచేసే ఈ ఫ్యాక్టరీ సాలీనా రూ. 5 కోట్ల విలువ చేసే విదేశీ మారకాన్ని ఆదాచేస్తుంది. ఎసిటోన్ ఒక ముఖ్య కార్బనిక రసాయనము (Organic Chemical) పెయింట్లు సువా సన ద్రవ్యాలు, ప్లాస్టిక్కులు, మందులు, లక్క వస్తువులు, విటమినులు, డైనమైటు, ఫొటోఫిల్ము వగైరా తయారీలకు ఇది విరి విగా ఉపయోగపడుతుంది.

* * *

## హిందుస్థాన్ షిప్‌యార్డు నవీకరణ:

రాష్ట్రప్రభుత్వానికి చెందిన విశాఖపట్టణం లోని హిందుస్థాన్ షిప్‌యార్డ్ నైపుణ్యంతో, ఆధునిక సాంకేతికతతో ఉత్తమరకం ఓడల నిర్మాణానికి రూ 60 కోట్లు ఖర్చుతో నవీ కరణావికి పూనుకుంది. పూర్తిగా మూయ బడిన ఈ పెద్ద డాక్ (dock) లో ఓడలు నిర్మిస్తారు.

* * *

## మధ్య ప్రదేశ్‌లో రూ. 18 కోట్లతో హొండా స్కూటర్ ప్రాజెక్టు :

జపాను దేశపు హోండా సహకారంతో రూ. 18 కోట్ల వ్యయంతో ఫిరోడియా స్కూటర్ తయారీ సంస్థ ఒకటి మధ్య ప్రదేశ్ ధార్ జిల్లాలో ప్రారంభించ బడు తూంది. ఈ సంస్థ సాలీనా 1,50,000 మొదలు 2 లక్షల స్కూటర్లను తయారు చేయగలదు. 1986 వ సం. లో తయారీ ముమ్మరంగా జరుగుతుంది ●

---

## 30 సం.ల భారతదేశపు కంప్యూటర్ పరిశ్రమ

రూ. 100 కోట్ల విలువచేసే భారతీయ కంప్యూటర్ పరిశ్రమకు 30 ఏళ్ళు నిండాయి. 1955 వ సం.లో హొల్లిరిత్ ఇండియా లిమి టెడ్ వారు సరఫరా చేసిన HEC-25 కంప్యూటరు కలకత్తా ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్‌లో ఏర్పాటు చేయబడింది. ఇప్పుడు ఈ పరిశ్రమలో 15 మంది ఉత్పాద కులు ఉన్నారు.

"జీవితంలో పొరపాట్లు కాంతికి నీడలవంటివి."

# ఆంగ్లేయ నిఘంటువు

ఒక ఆంగ్లేయ పెద్ద నిఘంటువులో సుమారు 5 లక్షలకు మించిన మాటలుంటాయి.




అందరికీ అన్ని మాటలు తెలియవు. ఎవ్వరూ అన్ని మాటలు ఉపయోగించరు కూడా. ఉన్నత పాఠశాలలో చదువుకుంటూన్న విద్యార్థికి మహా తెలిస్తే 2,000 లేక 3,000 మాటలు తెలిసి ఉంటాయి. బాగా చదువుకున్నవారికి దాదాపు 50,000 మాటలు తెలిసి ఉంటాయి.

సాధారణ గ్రంథంలో ఒక విద్యార్థి గానీ, విద్యార్థిని గానీ తెలుసుకోగల మాటలు సుమారు 7,700 ఉంటాయి. చదవడం, వ్రాయడం నేర్చుకున్నవారికి సాధారణంగా మూడు రకాల శబ్దజాలం ఉంటుంది. మాటలాడుకునేందుకు ఉపయోగపడే శబ్దజాలం, వ్రాతకు ఉపయోగపడే శబ్దజాలం, చదవడానికి ఉపయుక్తమయే శబ్దజాలం. ముఖ్యంగా ఎవరికైనా చదువుకోడానికి ఉపయోగపడే శబ్దజాలం అధికంగా ఉంటుంది. మాట్లాడుకోడానికి ఉపయోగపడే శబ్దజాలం అత్యల్పం.

అతి సామాన్యంగా వాడుకొనేవి 500 మాటలు, 1,000 మాటలు, 2,000 మాటలు ఉంటాయి. ఒక వ్యక్తి 1,000 మాటలు తెలుసుకుంటే వ్యవహార జ్ఞానం బాగా ఉన్నట్టు లెక్క.

కాని శబ్దజాలం ఎంత ఎక్కువగా ఉంటే అంత మంచి భావాలు, అభిప్రాయాలు ఏర్పడుతాయి. చదవడంలో కూడా మంచి నిరసత కలుగుతుంది శబ్దజాలం అభివృద్ధి చేసకోవాలంటే ఏదైనా కొత్త మాట వస్తే శబ్దకోశం చూడడం అభ్యాసం చేసుకోవాలి మరో విధానం క్రొత్త మాటలు ఉపయోగిస్తూండాలి!

## ప్రపంచంలో బ్రహ్మాండమైన కావ్యం మహాభారతం

భారతదేశపు సుప్రసిద్ధ ప్రాచీన కావ్యము మహాభారతం ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది. మొత్తం 18 సంపుటాలతో, 5,400 పుటలతో 2,20,000 పంక్తులతో ఏర్పడిన ఈ గ్రంథం క్రీస్తు పూ. 400 మరియు క్రీస్తు పూ. 150 మధ్య రచింపబడింది.

"తాను ఒకరికి చెప్పేముందు తాను ఆచరించాలి."

# మర్యాదను నిలబెట్టుకోవాలంటే

1. ఇతరులతో స్వచ్ఛమైన అనురాగంతో ప్రవర్తించు. ఇతరుల పట్ల ఆసక్తి, అభిమానం ప్రదర్శించు. ఎదుటి వారి ఆశలు, ఆశయాల గురించి వారి జీవితం గురించి మాట్లాడు. వారు నీ మీద మంచి అభిప్రాయం పెంచుకునేటట్లు మాట్లాడు.



2. ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉండు చిరునవ్వు చిందుతూ ఉండాలి. "నవ్వడం చేతకాకపోతే నువ్వు సేల్స్‌మన్‌గా పనికి రావు" అంటారు. నిజమే; జీవితంలో అన్ని రంగాలలోను ఈ మాట వర్తిస్తుంది. నవ్వు నలుగురికీ మేలు చేస్తుంది ఎంతో కష్టపడి సాధించలేని దానిని ఒక చిరునవ్వుతో సాధించగలవు. అయినా నవ్వు నాలుగు విధాల చెఱుపు అనేది మరిచిపోకూడదు.

3 పేర్లు జ్ఞాపకం పెట్టుకోవాలి పేరుతో పలకరిస్తే ఎదుటివారు ఒక గొప్పతనాన్ని పొందుతారు ఎక్కడైనా సరే ఒక వ్యక్తి తన పేరులో అనుభవించే మాధుర్యమే మాధుర్యం.

4 ఓపికగా విను. తొందర పడవద్దు. ఇతరులు చెప్పేది శ్రద్ధగా వింటే ఎదుటివారు చెప్పేది గౌరవిస్తున్నామని తను ఎంతో గొప్పవాడనే భావం ఏర్పడుతుంది జాగ్రత్తగా వింటేగానీ దుకాణదారుడు తన సరకును గురించి నచ్చచెప్పలేడు. అమ్మలేడు.

5. వారి వారి మనస్సులకు అనుకూలంగా వారి వారి అభిరుచులకు తగినట్లుగా మాట్లాడడం అలవాటు చేసుకోవాలి

6. మాట్లాడేటప్పుడు 'నేను, నాది' అనే మాట రాకుండా 'మీరు, మీది' మీరే గొప్పవారు అనే అభిప్రాయాన్ని కలిగించు. ఓర్పుగా వింటూ యోగ్యతను గ్రహించు. ఎప్పుడూ విమర్శలకు దిగకు. ఎదుటివారి ప్రవర్తనకు సరిపోయిన దృష్టితో మాట్లాడు. వ్యక్తిగత భావాన్ని ప్రదర్శించుకోకుండా ఎవరికి తగిన ప్రవర్తనను వారి యెడల చూపు. యుక్తితో వ్యవహరించాలి. ఎదుటి వారి కనుగుణంగా ప్రవర్తిస్తూ తాను 'తాను'గా మాత్రం ఉండటం జీవితంలో గెలుపును పొందడానికి కిటుకు ●

## వేగవంతమైన కంప్యూటరు

అనేక సంపుటాలు గల విజ్ఞాన సర్వస్వాన్ని పూర్తిగా 3 నిమిషాలలోనే పరిశీలించగల క్రొత్త కంప్యూటరు సెకండుకి 1,200 పుటలు చూడగలదు. ఈ పరికరంలో ఉపయోగించబడిన ఫైబర్ ఆప్టిక్ విధానం అతివేగంగా పనిచేస్తుంది

"అహంభావము సమూలముగా నశించుటయే నమ్రతకు అర్థం."

# ప్రపంచ వార్తలు

## కుజగ్రహం నుండి మీటియోరైట్ :

అమెరికాలో నాసా (Nasa) విజ్ఞాన వేత్తలు అంటార్కిటికాలో నాలుగు సంవత్స



రాల ముందు సంగ్రహించిన మీటియోరైట్ పశ్చిమజర్మనీ కొలోన్ యూనివర్శిటీకి 1 గ్రాము పంపారు ఇది కుజగ్రహాన్నించి లభించిందట యూనివర్శిటీలో రసాయనిక శాస్త్ర నిపుణులు దీన్ని పరిశోధించి ఇది అంతరిక్షంలో ఎంతకాలం ప్రయాణంచేసింది ఇది భూమిమీద ఎంత కాలం నుంచీ ఉంది అనే విషయాలు తెలుసుకుంటారు.

• • •

## స్వీడెన్‌లో ప్రపంచ నావికా విశ్వ విద్యాలయం :

అంతర్జాతీయ నావికా విధానంలో ఒక ముఖ్య అభివృద్ధి స్వీడెన్ మాల్మోలో ఏర్పాటు చేసిన(World Maritime University) విశ్వనావికా విశ్వవిద్యాలయం. అభివృద్ధిని పొందుతున్న దేశాలలో సీనియర్ ఉద్యోగస్థులకు, నిర్వహణ దారులకు, ఇతర ఉద్యోగస్థులకు ఉత్తమరీతి శిక్షణ, తర్ఫీదు ఇవ్వడమే ఈ యూనివర్శిటీ ముఖ్య ఆశయం.

• • •

## ప్రపంచంలో మిక్కిలి చిన్న విమానం :

రష్యాలో విమానాలను డిజైను చేసే అమెచ్యూరు విక్టర్ డిమిట్రియేవ్ ప్రపంచంలోనే మిక్కిలి చిన్న విమానం నిర్మాణం పూర్తి చేసాడు పూర్తిగా అమర్చిన తరువాత 40 కిలోలు తూగే ఈ విమానాన్ని విడిభాగా

---

## క్రొత్తరకం సిగరెట్లు

ఆంధ్రప్రదేశ్ రాజమండ్రికి చెందిన శ్రీ పి. కె. నరసింహారావు క్రొత్తగా కనిపెట్టిన 'స్మోకెట్టి' (Smokette) సిగరెట్టు త్రాగడం హానికరం కాదు. పసుపు ఆకుతో చేయబడ్డ ఈ సిగరెట్లలో నికొటైన్ 0.26 శాతం మాత్రమే ఉంటుంది మామూలు సిగరెట్లలో ఇది 1.5 శాతం ఉంటుంది. అంతేగాకుండా పసుపుకు మంచి ఔషధవిలువ కూడా ఉంది సాధారణ రోగాలకు ఎన్నిటికో దివ్య ఔషధం పసుపు.

"తప్పుచేయుట పాపము. దానిని మరుగుపరచుట మరింత మహా పాపము."

బుగా చేసి కారు టాపుమీద పెట్టవచ్చు. ఈ విమానం మోటారు సైకిల్ ఇంజనుతో తిరుగుతుంది. దీని రెక్కల విడివి 3 మీటర్లు. ఇది కేవలం 2 లీవర్లతోనే నియంత్రించ బడు తుంది.

* * *

## సౌదీ అరేబియాలో పెద్ద పైపు లైను :

1 6 బిలియనుల డాలర్ల వ్యయంతో సౌదీ అరేబియా రాజు ఫాహ్డ్ (Fahd) పెద్ద ఆయిల్ పైపులైనును ఆరంభించారు ఇది ఎఱ్ఱసముద్ర తీరంలో యాన్‌బు అనే చోట పెద్ద పెద్ద రిఫైనింగ్ మరియు పెట్రో కెమికల్స్ ఫ్యాక్టరీలకు ఇంధనాన్ని సరఫరా చేస్తుంది.

* * *

## 2,000 సం. లో నిరుద్యోగులు:

ప్రస్తుతం అభివృద్ధిని పొందుతూన్న దేశాలలో నిరుద్యోగులుగానీ, పెద్ద అర్హతలు కల్గి చిన్న ఉద్యోగాలు చేస్తున్నవారుగానీ మొత్తం 5000 లక్షలు. 2000 సం. నాటికి ప్రపంచంలో ఈ సంఖ్య 10,000 లక్షలకు పెరుగుతుందని అంచనా.

* * *

## ప్రతీ 12 నిమిషాలకు ఒక ఆత్మహత్య :

ప్రపంచ ఆరోగ్య సంస్థవారి అంచనా ప్రకారం ప్రపంచం అంతటా ఒకరోజుకి 1000 ఆత్మహత్యలు జరుగుతూంటే భారత దేశంలో ప్రతీ 12 నిమిషాలకు ఒక్కరు ఆత్మహత్య చేసుకుంటున్నారు.

* * *

## వృషభ గ్రహంలో క్రొత్త గ్రహ విధానం :

న్యూయార్క్‌లో ఇట్‌హాకా కు చెందిన అమెరికన్ ఖగోళ శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం భూమినుంచి 500 కాంతి సంవత్సరాల దూరంలో ఉండే వృషభగ్రహంలో సౌర కుటుంబాన్ని పోలిన మరో క్రొత్తగ్రహ విధానం (Hitau) హైటావు నక్షత్రం చుట్టూ ఏర్పడుతూంది. సుమారు 1,00,000 సంవత్సరాలకు పూర్వం ఏర్పడిన

---

## సహారా ఎడారి దక్షిణ దిక్కుగా విస్తరించుకుంటూంది



ఆఫ్రికాలో ఇసుకమయమైన సహారా ఎడారి గత 10 సంవత్సరాల నుండి సంవత్సరానికి 6 మొదలు 12 మైళ్ళ చొప్పున దక్షిణ దిక్కుగా విస్తరించుకుంటూంది.

"జ్ఞానమునకు పరమలక్ష్యం ఉత్తమశీల నిర్మాణం."

పైటావు నక్షత్రం చుట్టూ మన కణాలతో ఏర్పడిన మేఘం ఆవరించి ఉంటుంది

• • •

## పసిఫిక్ మరియు అట్లాంటిక్ మహా సముద్రాలను కలిపే క్రొత్త కాలువ:

పసిఫిక్ మరియు అట్లాంటిక్ మహా సముద్రాలను కలిపే 172 కి.మీ కాలువ త్రవ్వడానికి 8,000 మంది 8 సంవత్సరాలు పని చేస్తారు ఈ క్రొత్తకాలువలో పెద్ద పెద్ద ఓడలు పయనిస్తాయి. ఇది కొలంబియాలో ప్రారంభించి కరేబియన్ సముద్రంలో చేరే అట్రాటోనది. పసిఫిక్ మహాసముద్రంలో చేరే ట్రూ ఆండ్వోనదిగుండా ప్రవహిస్తుంది. కాలువ నిర్మాణం 2030 సం. లో ప్రారంభమవుతుంది

• • •

## ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద కారా కుం కాలువ దగ్గర క్రొత్త రిజర్వాయరు :

రష్యాలో సెంట్రల్ ఏషియన్ రిపబ్లిక్‌లో టుర్క్‌మేనియాలో కారా కుం కాలువ పరిసరాలలో నీళ్ళకు క్రొత్త రిజర్వాయర్ నిర్మింపబడుతూంది. ఎడారి మయమైన ఈ ప్రదేశంలో సుమారు 80 శాతం 1930 సం. లో సాగుబడికి ఉపయోగపడుతుంది. ఈ రిజర్వాయరులో ఉండే 30,000 లక్షల క్యూబిక్ మీటర్ల అమూల్యమైన మంచినీరు క్రొత్తగా ఏర్పడే భూ భాగానికి సరిపోతుంది. ఇప్పుడు కారా కుమ్ కాలువ పొడవు 1,100 కి.మీ పైబడి ఉంది. ఇది ఇంకో మూడవవంతు పొడిగించడానికి ఏర్పాట్లు చేయబడుతున్నాయి. ●

---

## ఎలుగుబంట్లకు ఘ్రాణేంద్రియం అతి సున్నితం



పొడుగాటి గోళ్ళతో లోపలకు తిరిగి చిన్న చిన్న వెడల్పైన పొట్టి పాదాలుండటం వల్ల ఎలుగుబంట్లు అతి సౌలభ్యంగా చెట్లు ఎక్కగలుగుతున్నాయి ఎక్కువ సామర్థ్యంగా పురుగుల కోసం నేలను త్రవ్వగలుగుతున్నాయి వీటికి కళ్ళు అంతబాగా కనిపించకపోయినా, చెవులు సరిగా వినిపించకపోయినా ముక్కుతో నైపుణ్యంగా వాసన చూసి పసిగట్టగలవు.

ఉష్ణ ప్రదేశాలలో ఎలుగుబంటులు శీతాకాలంలో సంచరించవు. ఆహారం తినవు. నిద్రావస్థలో (hybernating) ఉంటూ తమ శరీరంలో నిలువచేసుకున్న క్రొవ్వుమీదే జీవిస్తాయి.

---

"తమ తప్పు తాము ఒప్పుకొనుటయే ఆత్మశుద్ధికి ప్రథమ సోపానము."

# జయానికి రహస్యం



ప్రముఖ పారిశ్రామికవేత్త జి.డి. బిర్లా

1. ఒకరి మీద మరొకరు చెప్పే చాడీలను ఎన్నడూ వినేవాడు కాడు మంచిచెడ్డలు రెండూ వివేకంతో విచారించేవాడు. చాడీలు చెప్పేవారిని తిరస్కరించేవాడు.

2. ధార్మిక చింతన కలవాడు. ఎక్కడ ఉన్నా-ఎప్పుడూ 'గీత', 'జపమాల, 'ఆశ్రమ భజనావళి' వదిలేవాడు కాడు.

3 ఉన్నతాశయాలతో అతి వినయంగా 'జీవించడం' అనే ధర్మాన్ని మనసారా విశ్వసించిన మహనీయుడు.

4. సిగరెట్లు, చుట్టలు కాల్చి ఎరుగడు. మద్యపానీయాలు అసలు ముట్టలేదు. దురభ్యాసాలు లేని నియమబద్ధమైన జీవితం గడిపేవాడు.

5. అతి సామాన్యమైన శాకాహారి.

6. వేల రూపాయలతో కూడిన సమస్యనైనా, కోటిరూపాయలతో కూడిన సమస్యనైనా అతి శీఘ్రంగా, సాహసంగా నిర్ణయాలు తీసుకునేవాడు.

7. ఉక్కువంటి స్థిరసంకల్పం కలవాడు.

8. ఎటువంటి కష్టాలలోనైనాసరే ఎటువంటి ప్రతికూల పరిస్థితులలోనైనా సరే మనోవైకల్యం పొందనివాడు ఎలాంటి కష్టాలనైనా సరే లెక్కచేయనివాడు.

9 ఉన్నతాశయాలతో ఎప్పుడూ ధనఆత్మభావంతో (positive thinking) చలాకీగా, ఉత్సాహంగా ఉండేవాడు.

10. ఇతరులవద్ద నుంచి గ్రహించడంలో కాదు, ఇతరులకు తాను ఇవ్వటలో ఆనందాన్ని, తృప్తినీ పొందిన మహనీయుడు.

11. 'ఆలస్యం అమృతం విషం', ఇప్పుడే చేద్దాం, మన శాయశక్తులా ఇప్పుడే చేద్దాం అనేవాడు. కాలనియామాన్ని అతిక్రమించేవాడు కాడు.

('కిషోర్ పరేఖ్ అసోసియేట్స్' సౌజన్యంతో)

## పెద్ద బొజ్జలవారు గుండె పోట్లకు గురి అవుతారు

స్వీడెన్ గోట్‌బర్గ్ యూనివర్సిటీ ఛైర్మన్ డా. ఉల్ఫ్‌స్మిత్ పరిశీలన ప్రకారం బలిసిన తొడలు, నడుము ఉన్నవారికంటె బొర్రకడుపులవారు ఎక్కువగా గుండెపోటు జబ్బులకు గురి అవుతారు.

"ధర్మానుష్ఠానమున దాక్షిణ్యానికి తావులేదు."

# బహుమతి పొందిన వ్యాసం

## తెలుగు పత్రికలలో నేటి కథాసాహిత్యం

కుమారి సి. అపర్ణ, తెనాలి.

నాడు పెద్ద కథలు వ్రాయడం తేలికనిపించి 'వస్తువు ఆశయం, శిల్పం' వంటి వెన్నో పరిశీలింపబడి. కథనానికి అనువుగా నాయికా నాయకులను, ఇతర పాత్రలను తాపీగా తీర్చి దిద్ది అంతటి శ్రమను చిన్నకథగా మలచడం ఒక యజ్ఞంగా భావించేవారు.

రచయిత భావుకతకు, సామాజిక మానవతకు కథలు ఒకనాడు ప్రతిబింబాలుగా ఉండేవి. అటువంటి వాటిని తెలుగు పత్రికలు ప్రచురించడానికి పోటీపడేవి నేడు చూస్తున్న మినీ కథలు, కథానికలు, కథలు, నవలికలు, నవలలు వగైరా అన్నీ కథా సాహిత్యానికి చెందినవే. గుడిపాటి వెంకటచలం వంటి వారి సామాజిక స్పృహ కలిగిన పచ్చి రచనలు, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆలోచన రేపే కథలు, శ్రీనివాస శిరోమణిగారి 'ఖులాసా కథలు', భమిడిపాటివారి 'హాస్యకథలు' ఆయారోజుల్లో ఇన్ని పత్రికలు లేని కారణంగా పత్రికా ముఖంగా రాలేక పోయాయని అనుకోడంలో తప్పులేదేమో! ఈనాడు అధిక సంఖ్యలో పత్రికలు వస్తున్నా నాలుగు కాలాలపాటు

### రోబోట్ గాయకుడు



జపాన్ విజ్ఞాన నగరం అని చెప్పదగిన ట్సుకుబా (Tsukuba) దగ్గర 'ఎక్స్‌పో 85'లో జపాను ప్రభుత్వం ప్రదర్శించిన ఆటోమేటిక్ కీ బోర్డు ప్లేయింగ్ రోబోటు ఒక ముఖ్యమైన ఆకర్షణ. ఈ మరమనిషికి 'కళ్ళు' 'చెవులు' 'కంఠం' ఉన్నాయి. మాట్లాడుతూ కాగితాలమీది పాటలను చదవ గలదు. చేతులు, కాళ్ళు ఉపయోగించి కీ బోర్డును నిర్వహిస్తూ పాట పేరును కూడా చెప్పగల మానసిక శక్తిగల మెదడు కూడా ఈ రోబోటుకు ఉంది.

"పిల్లలు లేని ప్రపంచం దుఃఖభూయిష్ఠం.
వృద్ధులు లేని ప్రపంచం అమానుష ప్రపంచం." —కోలరిడ్జ్

లిచే కథ లెన్ని? అని ప్రశ్నించుకుంటే
లా సిగ్గు పడవలసి వస్తుంది.

ఈనాడు పత్రికల్లో ఒకే మూసలో పోసి
న్న ప్రేమ సాహిత్యం, భూత, ప్రేత
హిత్యం, పేద ధనిక వర్గాల వైషమ్య
హిత్యం, కుల సంబంధాల సాహిత్యం .
ంతే. ఇవి తప్ప మనం ప్రతిరోజూ చూసే
ద్దిపాటి కాల వ్యవధిలో వాస్తవమైన
ప్రహ' కలిగే రచనలు ఎన్ని వస్తున్నాయి
ని ప్రతి పత్రికా యజమాని, రచయిత,
ఠకుడు ప్రశ్నించుకుంటే ఎంతో మంచి
చనలు రాగలవు.

చలం, శ్రీపాద వగైరాలు కొన్ని కథలతో
రస్మరణీయులైతే, ఇప్పటికి కొన్ని వందల
లు రాశాను నేను, కాని 'నేనెక్కడ'
న్నారు కొడవటిగంటి యండమూరి వీరేంద్ర
థ్, మల్లాది కృష్ణమూర్తి చివుకుల పురు
త్తం, కొమ్మూరి వేణుగోపాలరావు వంటి
యితలు. వాసిరెడ్డి సీతాదేవి, యద్దనపూడి
లోచనా రాణి మువ్వాళ్ళ రంగనాయకమ్మ,
ంధర, జొన్నలగడ్డ (రామలక్ష్మి రాజ
పాలరావు) వంటి రచయిత్రులు పరిస్థితులకు
బడే కాబోలు అనేక రకాలైన రచనలు
గిస్తున్నారు.

'సీసపై వ్రాత మరుక్షణంలో పోయినా
తంపై వ్రాత కలకాలం వుంటుంది' అని
ర్తించి దానికి తగిన రచనలను ప్రోత్సహిస్తే
త్రికలన్నీ కూడా తెలుగువారి సాహిత్య
ంప్రదాయిక ప్రతికలుగా నిలిచిపోతాయి.

పి. మోహన్, కోరుకొండ.

హిత సహితమైంది సాహిత్యం. తక్కువ సమయంలో ఎక్కువ సామాజిక స్పృహను కలిగించే అమూల్య సాహితీ సాధనం కథ. గత శతాబ్దంలో పత్రికా ప్రపంచం తెలుగు నేలపై విజృంభించింది. తెలుగు పత్రికల్లో కథలకు పట్టం కట్టబడింది.

అయితే తెలుగు పత్రికల్లో వచ్చే కథల రాశి బ్రహ్మాండంగా ఉన్నా, వాసిలో అనుకున్నంత లక్ష్యసాధన చేయలేదనడం నిర్వివాద సత్యం.

---

## అతి చిన్న టీ. వీ. సెట్



జపాను దేశపు కన్స్యూమర్ ఎలక్ట్రానిక్ కంపెనీ కేసియో (Casio) ప్రపంచంలో అతి చిన్నదిగా, ఇమిడికగా ఉండే రెండు అంగుళాల స్క్రీను గల టీవీ సెట్‌ను ప్రవేశపెట్టారు. బ్యాటరీలతో సహా ఈ టీ.వీ. సెట్ 200 గ్రాములు మాత్రమే తూగుతుంది.

"మనస్సు ఉన్నచోటనే ఉంటుంది. స్వర్గాన్ని నరకంగానూ,
నరకాన్ని స్వర్గంగానూ మార్చుకోగలదు." —జాన్ మిల్టన్

చాలావరకూ వచ్చే తెలుగు పత్రిక కథలు కేవలం అభూత కల్పనలు, నేరపరిశోధనలు. వీటిని మించి అసభ్యమైన కథలు నేలయీనినట్టు పత్రికల్లో వెలుగు చూస్తున్నాయి.

రచయిత (త్రు) లకు ఒక లక్ష్యం లేదు. ప్రచురణకర్తలకు సొమ్మే ప్రధానం కాబట్టి కార్డు కథలు.మినీ కథలు, చిన్నకథలు, పెద్ద కథలు ఇగైరా విభిన్నావతారాలెత్తి కథాకన్య సెక్స్ గుప్పెట్లోనో, భూతాల చేతుల్లోనో కొట్టుకుంటూ విలవిల్లాడిపోతూంది.

ఇప్పుడైనా కథారచయితలు నిజం కళ్ళద్దాల్లో చూచి నిజమైన కథలను కమనీయంగా అందించాలని ఆకాంక్షిస్తా.

* * *

కందుకూరి సోమయ్య, కేసముద్రం.

పత్రికలు అంటే ప్రజలకు ప్రపంచ జ్ఞానాన్నీ, నూతన జీవిత విధానాన్నీ బోధించే సాధనాలు. పత్రికల్లోని సాహిత్యానికి అనుగుణంగా సమాజం మార్పుచెందుతుంది. నేటి తెలుగు పత్రికలు ప్రజలు అభిలషించే సాహిత్యాన్నే స్వలాభాన్ని అపేక్షించి అందజేస్తున్నారు. పత్రికల సాహిత్యానికి అనుగుణంగా ప్రజలు మార్పుచెందాలేగాని ప్రజల బలహీనతను ఆసరాగా చేసుకుని పత్రికలు నడవకూడదు. అందుకే అన్నారేమో శ్రీశ్రీ "కట్టుకథలకు, పెట్టుబడులకు పుట్టిన విష పుత్రికలు మన పత్రికలు."

మంచి సాహిత్యం, విజ్ఞానదాయకమైన కొన్ని పుస్తకాలు ప్రచురింపబడుతున్నా వాటికి పాఠకులు ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వడం లేదు. చాలావరకు మన పత్రికలు అశ్లీల, నేర, క్షుద్ర కథాసాహిత్యాన్నే అందించి లాభార్జనకే ఎక్కువ ప్రాముఖ్యతను ఇస్తున్నారు. ఇటువంటి సాహిత్య పత్రికలపై ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకోవాలి. ఇప్పటికైనా మన తెలుగు పత్రికల్లో ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే కథా సాహిత్యం అందించకపోతే తెలుగు ప్రజల గౌరవం చెడిపోతుంది.

## కపిల్‌దేవ్ 24 సం.లో బెస్ట్ డబుల్



భారతదేశపు క్రికెట్ ఆటగాడు కపిల్‌దేవ్ అతి తక్కువ వ్యవధిలో—అంటే ఒక సంవత్సరం, 107 రోజులలో, తన 21 సం. రాల, 27 రోజుల వయస్సులో 25 వ పందెంలో 1000 రన్స్, 100 వికెట్లు డబుల్‌ను సాధించాడు. 24 సం. రాల 68 రోజుల వయస్సులోనే 2000 రన్స్, 200 వికెట్లు ఉత్తమమైన డబుల్‌ను సాధించాడు.

# మీకు తెలుసా?

శ్రీమతి శాంతారావు

కుంకుమ పూవు: కుంకుమ పూవును స్ాఫ్రన్ (saffron) అంటారు. ఈ పదం సహాఫార్న్ అనే అరబ్బీ మాట నుంచి




పుట్టింది. సహాఫార్న్ అంటే దారం. కుంకుమ పూవు క్రోకస్ సటివుస్ (crocus sativus) వృక్షజాతి పువ్వులో కీలకము మీద ఉండే కీలాగ్రాలు. కాశ్మీరు లోయలో అక్టోబరు మాసంలో ఈ చెట్లు విస్తారంగా పూవులు పూస్తాయి. పువ్వులు లేత ఎరుపువర్ణంలో ఉంటాయి. ఒక కిలోగ్రాము కుంకుమ పువ్వు సేకరించడానికి 1,00,000 పువ్వులు అవసరం ఉంటుంది.

• •

కాఫీ: కాఫీలో సాధారణంగా కాఫీ అరాబికా అవి, కాఫీ రోబస్టా అని రెండు రకాలు ఉన్నాయి. అరేబియాలో ఈమెన్ నుండి వచ్చినదే కాఫీ అరాబికా. 17 వ శతాబ్దంలో బాబాబుడాన్ సాహెబ్ అనే



మహమ్మదీయుడు మక్కాకుపోయి తిరిగి వచ్చేటప్పుడు కాఫీ అరాబికాను ఇండియాకు తీసుకువచ్చాడు. కాఫీ రోబస్టా 9 0 లో

## దహోమి భాషలో 'year'

ఆంగ్ల పదం year (సంవత్సరం). దాహోమీ (పశ్చిమ ఆఫ్రికా) భాషలోకి అనువదిస్తే 'జొన్నలు కోసి, తిని, తిరిగి పండించి వాటిని మళ్ళీ కోయడం' అనే అర్థం వస్తుంది.

జావా నుండి ఇండియాకు తీసుకు రాబడింది.

* * *

లవంగాలు: లవంగాలు ముఖ్యమైన సుగంధ ద్రవ్యం. లవంగాలకు క్లోవ్ (clove) అనేమాట లాటిన్ క్లావుస్ (clavus) నుంచి వచ్చింది. ఫ్రెంచిలో దీన్ని క్లో (clou) అంటారు. రెండు పదాలకు అర్థం ఒకటే



'గోరు'. సుగంధ ద్రవ్యంగానే కాక అనేక ఔషధాల తయారీకి ఇది ఉపయోగపడుతుంది. లవంగనూనెను పంటి రోగాలకు ఉపయోగిస్తారు.

* * *

చంపకపుష్పం (సంపెంగ): చంపక పుష్పం సుగంధ పుష్పాలలో ఒకటి. ఈ సువాసనవల్ల కొందరికి తలనొప్పి కూడా వస్తుంది. తేనెటీగలు దీని మీద చేరవు. చెట్లు సాధారణంగా 30-40 అ. ఎత్తు పెరుగుతాయి. కర్ణాటక మైసూరు జిల్లాలో కొల్లేగల్‌లో ఒక సంపెంగ చెట్టు 66 అడుగుల లావుగా 215 అడుగుల ఎత్తుకు పెరిగింది. అస్సాములో పీటలు, పడవలు తయారు చేయటానికి చంపక కర్రను ఉపయోగిస్తారు. శ్రీలంకలో ఈ కర్రతో బుద్ధుని విగ్రహాలు చెక్కుతారు. చెట్టు బెరడును, పువ్వులను కూడా ఔషధాలలో విరివిగా ఉపయోగిస్తారు. కంటి రోగాలకు, నరాల రోగాలకు దీని నూనె మంచి ఔషధం. నాసికా రోగాలకు, తలనొప్పులకు, సువాసన ద్రవ్యాల తయారీకి కూడా దీనిని విస్తారంగా ఉపయోగిస్తారు.

* * *

చెట్టు పనస: చెట్టు పనస (Bread-fruit) మలేషియా ఆర్చిపెలాగో నుంచి వచ్చింది. ఇది మొట్ట మొదట డచ్ నావికులు ఇండియాలో ప్రవేశపెట్టారు. కొన్ని దూర ప్రాచ్యదేశాలలో చాలామందికి ఇది ముఖ్య ఆహారం. కాబట్టే దీనిని ఆంగ్లంలో 'బ్రెడ్ ఫ్రూట్' అంటారు. చెట్టుపనస లేక సీమ పనస ముఖ్యంగా కూరలకే ఉపయోగిస్తారు. దీంట్లో ఉండే 28 శాతం కార్బోహైడ్రేటులు అరటిపండులో కంటే ఎక్కువ. ●

## భారతదేశంలో బిస్కట్ల ఉత్పత్తి 5 లక్షల టన్నులు

భారతదేశంలో సాలీనా సుమారు ఐదు లక్షల టన్నుల బిస్కట్లు ఉత్పత్తి అవుతున్నాయి. ప్రపంచంలో భారీ ఎత్తున బిస్కట్లు తయారు చేసే అయిదు దేశాలలో భారత దేశం ఒకటి. వీటి విశిష్టత అంతర్జాతీయ స్థాయికి సమానంగా ఉంటుంది.

# "నా జీవితమే నా సందేశం"

సత్యం
అహింస
శాంతి
ప్రేమ
సహనం
నిర్భయత
సమానత
నిరాడంబరత
స్వదేశీ

గాంధీజీకి, అవి కేవలం మాటలు, చిహ్నాలు మాత్రమే కాదు వారి ప్రతీ చర్యకి, ప్రతీ పనికి, అవి గీటురాయి. మానవ విలువలకు నిగ్గుదీసేవిగా. అది వారి జీవితాన్ని మార్చివేసింది. వారి ప్రతీ మాట, వాస్తవానికి, ఒక సందేశం

మనలని ఎల్లప్పుడూ
ప్రేరేపించే ఒక సందేశం



# ఔషధ ప్రపంచం

## సునిశితమైన రక్త పరిశోధన:

అమెరికా బోస్టన్‌లో మెస్సాచూసెట్స్ జనరల్ హాస్పిటలు మరియు పారిస్ (ఫ్రాన్స్) ఇన్స్టిట్యూట్ గుస్టావె రుస్సీకి చెందిన వైద్య పరిశోధక బృందం క్రొత్తగా రక్త పరిశోధనను సునిశితంగా చేయడం అభివృద్ధి పరచారు. దీనివల్ల వైద్యులు లివరు సంబంధమైన క్యాన్సరు వ్యాధులను ముదరకుండా మొదట్లోనే తెలుసుకో గలుగుతున్నారు. ఈ క్రొత్త పరిశోధనవల్ల ప్రపంచంలో సుమారు 2,60,000 మందిని పట్టి సంవత్సరానికి 100 శాతం మృత్యువాత పెడుతున్న హెపాటో సెల్యూలర్ కార్సినోమా అనే రోగాన్ని ప్రథమావస్థలోనే తెలుసుకో గలుగుతున్నారు.

హెపటిటిస్ బి వైరస్ వల్ల లివరు క్యాన్సరు ప్రపంచంలో అనేక ప్రదేశాలలో ముఖ్యంగా ఆఫ్రికా మరియు దూరప్రాచ్య దేశాలలో సంభవిస్తుంది.

*

## ఆటోప్లాస్టి విధానం కల్పించబడింది:

మాస్కో (రష్యా) లో ట్రామటాలజీ మరియు ఆర్థో పేడిక్స్ సెంట్రల్ ఇన్స్టిట్యూట్‌లో సోవియట్ వైద్య శాస్త్రజ్ఞులు ఆటోప్లాస్టి విధానాన్ని కల్పించారు. ఇక మీదట శస్త్రవైద్యులు రక్తనాళాలకు దెబ్బ తగలకుండా చర్మాన్ని, ఎముకలను ట్రాన్స్ప్లాంటు చేయగలుగుతారు.

* * *

## క్రొత్త ఆంటీబయోటిక్ ఔషధం:

క్రొత్త ఆంటీ బయోటిక్ సెపోరిన్

---

## సిగరెట్టు పుట్టని పాపకీ అపాయమే



పొగ త్రాగడం వల్ల గుండెజబ్బులు, ఊపిరితిత్తుల క్యాన్సరు, పెప్టిక్ అల్సరు, బ్రోంకైటిస్ ఇంకా అనేక ఊపిరితిత్తుల రోగాలు కలుగుతాయి. పొగ త్రాగేవారి సమీపంలో ఉండేవారికి కూడా ఈ రోగాలు వస్తాయి. స్త్రీలు పొగత్రాగడం పుట్టబోయే బిడ్డకు కూడా అపాయమే.

—('డిఎవిపి, న్యూఢిల్లీ' సౌజన్యంతో)

---

"మానవుడు మానవునిజూచి భయపడుట మనకు సిగ్గుచేటు."

(ceporin) అనే మందు పెన్సిలిన్ కంటే చాలా అమోఘంగా పనిచేస్తుంది, ఎడింబరో (బ్రిటన్)లో ఈ మందు ఒక రోగి మెదడులో ట్యూమరుని నివారించింది.

* * *

## గాయాలతీవ్రతను తెలుసుకునే క్రొత్త విధానం:

ముఖ్యంగా తీవ్రమైన గాయాలకు లెనిన్‌గ్రాడ్ (రష్యా) మెడికల్ ఇన్‌స్టిట్యూట్ వైద్య నిపుణులు మామూలు ఎక్స్‌రే విధానానికి బదులుగా హోలోగ్రఫీ విధానాన్ని సిఫారసు చేస్తున్నారు. లేజరు కిరణాల వల్ల ఏర్పడ్డ హోలోగ్రామ్ గాయాల చిత్రాలను మూడు పరిమాణాలలో ప్రదర్శించడం వల్ల అతి సూక్ష్మమైన గాయాలు, లోపల చేరిన లోహపు ముక్కలను కూడా సులభంగా తెలుసుకోగలుగుతున్నారు.

* * *

## వేపాకు కషాయం తామరకు మంచి మందు:

ఎండిన వేపాకుతో తయారుచేసిన లోషను తామర, తీట, గజ్జి, దురదలు మొదలగువాటిని అమోఘంగా నివారిస్తుందని లక్నో (ఉత్తర ప్రదేశ్)లో కింగ్ జార్జెస్ మెడికల్ కాలేజీ విభాగం డైరెక్టరు డా. నరేంద్రసింగ్ చెబుతున్నారు వేప ఆకుల కషాయం క్యాప్సూల్సు రూపంగా కూడా వాడవచ్చు అంటున్నారు.

* * *

## కలరా నివారణకు క్రొత్త రకం వాక్సీను:

ఫ్రాన్స్ పాస్ట్యూర్ ఇన్‌స్టిట్యూట్‌లో కలరా నివారణకు కనిపెట్టిన క్రొత్తరకం వాక్సీను విషం కాదు. దీని ప్రభావం 7 మాసాల దాకా ఉంటుంది. ఈ క్రొత్త వాక్సీనును ఈ మధ్య జెయిరీ (ఆఫికా)లో దిగ్విజయంగా వాడారు వాడకం సులభం. 4 మాత్రలు రెండుసార్లు తీసుకుంటే చాలు.

* * *

## క్యాన్సర్ నిరోధక ఔషధం:

మద్రాసు అడయారులో కాప్టెన్ శ్రీనివాసమూర్తి ఆయుర్వేద ఔషధ పరిశోధక సంస్థ సాధారణంగా కట్టవలమీద పెరిగే 'సొలానమ్ ట్రైలో బేటమ్' (దూదువాళై) మొక్క నుండి కొత్తరకం క్యాన్సర్ నిరోధక ఔషధం తయారుచేశారు. ఈ మందు ఇచ్చిన వెంటనే శరీరంలో రోగం కేంద్రీకరించుకుని పైకి వస్తుంది. అందుచేత రేడియం వైద్యానికి సహాయకారిగా ఉంటుంది. ●

---

## ధరలు మిక్కిలి అధికంగా ఉన్న నగరాలు

బిజినెస్ ఇంటర్ నేషనల్ కార్పొరేషన్ వారు గౌరవ ప్రదమైనవని పరిగణించిన 85 నగరాలలో లాగోస్ (నైజీరియా), టోకియో (జపాను) లలో గత మూడు సంవత్సరాల నుంచీ ధరలు మిక్కిలి ఎక్కువగా ఉన్నాయి.

"క్రోధము నిజమిటయే మూలము ఒంటరివాడపైన నేమీ
ధర్మయుక్తమైన మాటను పలికియే తీరవలెను."

# పర్వ శ్రే

మధ్య అట్లాంటిక్ మహాసముద్రంలో మహోన్నత పర్వత శ్రేణి, భూతలం మీదే మిక్కిలి పెద్ద పర్వత శ్రేణి. 7000 మైళ్ళ పొడవు 500 మైళ్ళ వెడల్పు గలిగిన



ఈ పర్వత శిఖరాలు ఆకాశాన్ని అంటుతూంటాయి. తీర ప్రదేశానికి సమాంతరంగా సముద్రం మధ్య 'S' ఆకారంలోగల ఈ పర్వత శ్రేణి ఒక వరుసలో సుదీర్ఘంగా ఉండే పర్వతశ్రేణి.

మధ్య అట్లాంటిక్ సముద్ర పర్వతశ్రేణి సముద్ర మట్టానికి 6000 మరియు 9000 అడుగుల లోతున ఏర్పడింది. అప్పుడప్పుడు ఈ పర్వత శిఖరాలు కొన్ని సముద్ర మట్టానికి పైకి పెరిగి ద్వీపకల్పాలుగా ఏర్పడుతాయి. ఈ విధంగా ఉద్భవించినవే ఐస్‌లాండ్, ఎజోర్స్, సెంట్ పాల్ పర్వతాలు ఎసెన్షియన్ ద్వీపకల్పము, ట్రిస్టాన్ డా కన్హా, బొవ్వెట్ ద్వీపకలం. ఈ పర్వత శ్రేణిలో అత్యున్నతమైన శిఖరం ఎజోర్స్‌లో పికో శిఖరం. ఇది సముద్ర మట్టానికి 7615 అడుగుల ఎత్తున మరియు సముద్రంలో భూగర్భానికి 27 500 అడుగుల ఎత్తుగా ఉంటుంది.

సాగర గర్భంలో మరుగు పడిపోయిన పర్వతం 'గుయాట్' (Guyot). ఇది బల్ల పరపుగా ఉండే సాగర పర్వతం. సముద్రపు లోతులను కొలిచే ఫాథోమీటర్ల సాధనాలతో నావికులు రెండవ ప్రపంచ యుద్ధంలో 150 కి మించిన ఇట్టి పర్వతాలను కనుగొన్నారు. ఆ నాటినుండి పసిఫిక్ మహాసముద్రంలోనూ, కొన్నిటిని అట్లాంటిక్ మహాసముద్రంలోనూ 500లకు మించే ఈపర్వతాలను గుర్తించారు.

గుయాట్ పర్వతాలు అగ్నిపర్వతాలు. మహాసముద్రంలో లేచే పెద్ద పెద్ద తరంగ ప్రభావం వల్ల ఈ పర్వత శిఖరాలు చదునుగా ఏర్పడి ఉండాలి. ఈ నాటికీ ఈ చదును పర్వతాలు అరమైలు లోతున నీటితో కప్పబడే ఉంటాయి. ఇవి ప్రప్రథమంగా సముద్ర గర్భం నుంచి పుట్టినా సముద్రం నీటిమట్టం నీటి పైకి ఉబికి ఉండవచ్చు. లేదా ఆ పర్వతాలు వాటి భారంవల్లే నీటిలోకి మునిగిపోయి ఉండవచ్చు. లేదా సముద్రంలో భూగర్భమే క్రిందికి క్రుంగిపోయి ఉండాలి. ●

"పేదల సేవయే ప్రత్యక్ష పరమేశ్వరుని రూపము."

# వీరిని గురించి తెలుసుకోండి

**మిక్‌హెయిల్ సెర్‌గెయేవిచ్ గోర్బొచేవ్:**

1955 వ సం॥లో మాస్కో (రష్యా) స్టేట్ యూనివర్సిటీలో పట్టభద్రుడై 1967 వ సం.లో స్టావ్‌రోపోల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టి



ట్యూట్‌లో వ్యవసాయ శాస్త్ర పరిశోధకుడుగా ప్రసిద్ధిపొందారు. ఇతడు లెనిన్ ఆర్డరును, అక్టోబరు విప్లవం ఆర్డరును, రెడ్ బానర్ ఆఫ్ లేబర్, బాడ్జ్ ఆఫ్ హానర్ మరియు మెడల్స్ పొందారు. ఇతడు ఇప్పుడు రష్యాలో కమ్యూనిస్ట్ పార్టీకి ముఖ్య కార్య నిర్వాహకుడుగా ఉన్నాడు.

• • •

**దామెర్ల రామారావు (క్రీ. శ. 1897—1925):**

ఆంధ్రదేశపు గొప్ప చిత్రకారుడు. ఇతడి తోనే ఆంధ్ర చిత్రకళలో నూతన శకం ప్రారంభమైంది. నివాసస్థలం రాజమహేంద్ర వరం. ప్రకృతి భావాన్ని చిత్రకళలో సమన్వయ పరచి, చిత్రకళలో ఆంధ్ర సాంప్రదాయమనే ఒక నూతన పద్ధతిని స్థాపించాడు. 1920 వ సం.లో స్టూడియో ఏర్పాటు చేసి అనేక అపూర్వ చిత్రాలను రూపొందించాడు. నవ్యాంధ్రలో లలితకళల పునరుజ్జీవనోద్యమంలో యవనదశ, అజంతాదశ, ఆంధ్రదశ అను మూడు దశలలో ఆంధ్రదశ ఇతడి శైలియందు పరిణతిని పొందింది. 'సరోవరము' 'గోదావరి కనుమ' 'సిద్ధార్థుని రాగోదయము' మొదలైనవి వీరి అపూర్వ చిత్రాలు. స్థానిక రామారావు ఆర్ట్‌గ్యాలరీలో వీరి చిత్రాలను చూడవచ్చు.

## సత్య సముద్రం అనంతం!

మరణావస్థలో ఉన్న న్యూటన్ మహాశయుని చూచి ఒకరు 'ప్రకృతి సిద్ధాంతాలలో మీరు మునిగి తేలడం అనేది గర్వించ వలసిన విషయం' అన్నారు. దానికి న్యూటన్ 'అంతు పంతు లేని మహా సముద్రం అనంతమై ప్రవహిస్తూ ఉంటే గట్టుమీద ఇసుకలో గుల్లలు ఏరుకునే బాలుని వంటి వాణ్ణి నేను' అన్నాడు.

---

**"మానవుడు తనను తాను సంస్కరించుకుంటే సంఘాన్ని సంస్కరించగలుగుతాడు."**

**లక్ష్మి (డా· త్రిపురసుందరి):**

గొప్ప తమిళ నవలారచయిత. ఈమె షుమారు 108 నవలలు, 1000 కథానికలు, పలు రేడియో నాటికలు రచించారు. దక్షిణ ఆఫ్రికాలో 22 సం॥లు జీవించి గొప్ప చరిత్రను సృష్టించిన మహిళ 1984 సం.లో 'ఒరు కావేరియైపోలె' అనే నవలకు సాహిత్య అకాడమీ బహుమానాన్ని అందుకుంది.

* * *

**విజయ్ అమృతరాజ్:**

మద్రాసు రామనాధన్ కృష్ణన్ తరువాత టెన్నిస్‌లో గొప్ప పేరు పొందిన ఆటగాడు. నిపుణుడు. ప్రపంచంలో అతి నిపుణులైన జోర్న్ బోర్గ (Bjorn Borg), జాన్ మెకన్‌రో (John McEnroe) మొదలైన వారిని కూడా మించినవాడు. మే 1982 లో కొబే (జపాన్) ప్రపంచ ఛాంపియన్ షిప్ పోటీలో జెకోస్లోవేకియాకు చెందిన నెం. 2 ఇవాన్ రెండెల్‌తో ఆడి గెలిచాడు. అమెరికా ఫైనల్స్‌లో సాండీమేయర్ అస్వస్థత వల్ల విరమించుకోవటంతో విజయ్ గెలుపొంది నట్టుగా డిక్లేర్ చేశారు.

## అమెజాన్ నదీ జలాలలో 2,000 రకాల చేపలు నివసిస్తున్నాయి



దక్షిణ అమెరికాలోని అమెజాన్ నది ప్రతీ సంవత్సరం 6,500 ఘన కిలో మీటర్ల నీటిని సముద్రంలోకి ప్రవహింపజేస్తుంది. ఈ నీరు సముద్రంలో కలిసే చోట అమెజాను లోతు 90 మీటర్లు పైబడి ఉంటుంది. దీని ప్రవాహ వేగం నిమిషానికి 2 మీటర్లు అతి వేగమైన ఈ ప్రవాహంలో కొట్టుకువచ్చిన ఇసుక 190 మీటర్లు పొడవు, 8 మీటర్ల ఎత్తు గల మేటగా ఏర్పడుతుంది. ఈ అమెజాన్ జలాలలో సుమారు 2,000 రకాల చేపలు నివసిస్తాయి. అమెజాన్ అడవులలో 400 పైబడిన రకాల చెట్లు పెరుగుతాయి. యూరపులో కనిపించే చెట్లు రకాలకు ఇవి రెట్టింపు. అమెజాన్ ప్రవాహం నీటిలో కరిగిన లవణాలను (సుమారు 3000 లక్షల టన్నులు — ప్రపంచంలో అన్ని నదుల కంటే ఎక్కువ) సముద్రంలో చేరవేస్తుంది. తేలుతుండే మలిన పదార్థాలు (సుమారు ఒక బిలియను టన్నులు—గంగా-బ్రహ్మపుత్ర, హాంగ్‌హో తరువాత మూడవది). సముద్రంలో ఇవి ఎలా మార్పు చెందుతున్నాయో ఇంకా ఎవ్వరికీ తెలియని విషయం.

"ఏకాంతంలో ఆనందాన్ని అనుభవించేవారు
ఆత్మ ప్రగతిలో విహరిస్తారు." —తాయుమానవర్

(8 వ పేజీ తరువాయి)

మంత్రి పదవిని అధిష్ఠించింది. ఆనాటినుండి మార్చి 1977 వరకు ప్రభుత్వ నాయకత్వాన్ని వహించింది. మార్చి 1977 ఎన్నికలలో విజయం పొందలేక పోవడం వలన ప్రధాన మంత్రిపదవికి రాజీనామా ఇచ్చిప్రభుత్వ కార్య రంగం నుంచి తాత్కాలికంగా విరమించుకో వలసి వచ్చింది.

పిదప 1980 లో జరిగిన ఎన్నికలలో విజయం సాధించి, తిరిగి ప్రధాన మంత్రిగా ఎన్నుకోబడింది నాటి నుండి విభిన్నమతాలు, విభిన్న భాషలు, విభిన్న ఆచారాలు, విభిన్న వ్యవహారాలు గల 70 కోట్ల పైబడిన జనాభాగల భారతదేశానికి అమర ణాంతం నాయకత్వం వహించింది. దేశంలో ఈమె చేపట్టని సాంస్కృతిక సంస్థగానీ, సంక్షేమ పథకంగానీ లేదు.

ఈమె ప్రతిదినం రోజుకి సగటున 17 గంటలు నిర్విరామంగా విసుగు లేక దీక్షతో ప్రభుత్వ కార్యకలాపాలను అమిత ఆనందంతో ఉత్సాహంతో కొనసాగించేది. మంచుకప్పిన పర్వత శిఖర దృశ్యాలకు ముగ్ధురాలు అగుచు, ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించి ప్రకృతి సౌందర్య సంరక్షణకు, ప్రవృద్ధికి ఈమె సలి పిన కృషి అపారం, అమోఘం.

ప్రత్యేక ఆదరాభిమానాలతో ఆర్థికంగా వెనుకబడిన వర్గాలవారి అభ్యుదయానికి, వివిధ లాంగుల జీవనోపాధికి ఈమె ఒనర్చిన సేవ అనిర్వచనీయం. 'గరీబీ హటావో' అనే నినా దంతో దేశంలో సర్వతోముఖ సంక్షేమాభి వృద్ధికి, దారిద్ర్య విమోచనానికి 20 అంశాల కార్యక్రమాన్ని చేపట్టింది. అంతర్జాతీయ సమస్యలను చక్కగా అవగాహన చేసికొని అతి నైపుణ్యంగా, అతి సామర్థ్యవంతంగా వాటిని పరిష్కరించిఅంతర్జాతీయ గౌరవాన్ని, మెప్పును పొందగల్గింది.

ప్రపంచంలో వివిధ విశ్వవిద్యాలయాలు, విద్యాసంస్థలు ఈమెకు గౌరవ డాక్టరేటు బిరు దుల నిచ్చి సన్మానించాయి. అనేక అంతర్జా తీయ బహుమానాలను అందుకుంది. మన దేశంలో అత్యంత గౌరవప్రదమైన 'భారత రత్న' బిరుదుతోపాటు అమెరికా 'మదర్స్ అవార్డు', ఇటలీ 'ఇజబెల్లా డి ఎస్టే' అవార్డును గ్రహించింది. 1971 సం. లో ఫ్రెంచి ఇన్‌స్టి

## ఒక గాలను సాగర జలంలో 4 ఔన్సుల ఉప్పు



ఒక గాలను సముద్రపు నీటిలో 4 ఔన్సుల ఉప్పు ఉంటుంది. అన్ని సము ద్రాలలో, మహా సముద్రాలలో లభించే ఉప్పును అంతా పోగుచేస్తే 50,00,000 ఘన మైళ్ళ మేట అవుతుంది.

"వినమ్రులు ధన్యులు, భూమండలమునకు వారు వారసులు.

ట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఒపీనియన్ వారు ఈమెను ప్రపంచంలో మిక్కిలి ఆదరణకు గురైన యువతిగా ఎన్నుకొని గౌరవించారు.

వివిధ దేశాభ్యుదయ కార్యక్రమాలలోను, ప్రగతి కార్యక్రమాలలోను నిర్విరామకృషితో ఈమె నిత్య నవ్యాభిలాషతో తెలుసుకోని విషయం లేదు. పఠించని గ్రంథం లేదు. స్వంతంగా ఈమె 'ఎటర్నల్ ఇండియా మావరైట్' (Eternal India Mavarite), మై ట్రూత్ (My Truth). పీపుల్స్ అండ్ ప్రాబ్లమ్స్ (Peoples and Problems) మొదలైన అనేక గ్రంథాలను రచించింది. కళలయందు, విజ్ఞానశాస్త్ర విషయాలందు మిక్కిలి అభిలాషతో అంతరిక్ష మరియు అణు పరిశోధకాభివృద్ధికి, ప్రగతికి ఈమె ఒనర్చిన సేవ అనిర్వచనీయం.

ఈమె ప్రత్యేక ప్రోత్సాహంతో 1982వ సం. లో న్యూఢిల్లీలో ఏర్పాటు కావింపబడిన ఆసియా క్రీడలు ప్రపంచ ప్రశస్తిని పొందాయి. అలీన అగ్రరాజ్య సమావేశాన్ని మరియు కామన్‌వెల్త్ ప్రభుత్వ నాయకుల సమావేశాన్ని ఈమె దిగ్విజయంగా జరిపించడం మనకు గర్వకారణం. 1983వ సం. లో ఏర్పాటైన అలీన అగ్రరాజ్య సమావేశానికి చెయిర్ పర్సన్‌గా నియమింపబడటం మన భారతదేశానికే గొప్ప మర్యాద. ఈమె తన అంత్యకాలం దాకా దేశ సమైక్యతకు, ప్రగతికి, వికాసానికి కృషిసలిపి భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రతిపాదించిన మహాసాధ్వి.

తన అంతిమ ప్రసంగంలో "నా శరీరంలో ప్రవహించే రక్తం ప్రతి బొట్టు ఈ దేశాన్ని ఇతోధిక చైతన్యవంతం, ప్రగతి కరము చేయగలదని ఆశిస్తున్నాను" అని ఉద్ఘాటించింది.

ఈమె అక్టోబరు 31, 1984న న్యూఢిల్లీలో తన ఇంటిదగ్గర హత్య కావింపబడింది. ముందుచూపుతో దేశానికి మహోజ్వల భవిష్యత్తును ఆశించిన గొప్ప నాయికరాలి అకాల మరణంవల్ల భారతదేశానికేగాక ప్రపంచానికి కూడా తీరని లోటు సంభవించింది. ఈమె మరణంతో భారతదేశ చరిత్రలో ఒక మహోన్నత ఘట్టం అంతమైంది ●

## ఆడ పావురం మూడవ భార్య!



పశ్చిమ బెంగాల్ మరియు ఇతర ప్రాచ్య రాజ్యాలలోను శిష్టాచార సంపన్న గృహాలలో మూడవ పెళ్ళి చేసుకునే ముందు—మూడవది ముక్కాలవుతుంది మూడవ సంఖ్య దురదృష్టమని — మొదట ఒక ఆడపావురాన్ని మూడవ భార్యగా స్వీకరించి తరువాత అసలు పెళ్ళికూతురుని నాల్గవ భార్యగా గ్రహిస్తారు. మన ప్రాంతాలలో జరిగే అర్క వివాహాలు, కదళీ వివాహాలు ఇటువంటివే కావచ్చు.

"ఉద్వేగము లేనివారు ధన్యులు, స్వర్గసామ్రాజ్యము వారిదే."

# పోటీలు

(నవంబరు 1985)

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు. రూ. 7 లు. రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరుతేదీ: నవంబరు 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్‌డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

-సంపాదకుడు.

# వ్యాసం

'శీతల తైములు లేని ఇంటిపని' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

# క్విజ్

1. ఈ క్రింద సూచించిన ఏ దేశంలో భారతదేశానికి అంబాసడర్ ఉండరు, హైకమిషనర్ మాత్రం ఉంటాడు?

(ఎ) సోవియట్ యూనియన్, (బి) అమెరికా, (సి) యు కె. (డి) జపాను.

2. భారతదేశంలో మిక్కిలి పెద్ద పరిశ్రమ ఏది?

(ఎ) బట్టల పరిశ్రమ, (బి) ఇనుము మరియు ఉక్కు, (సి) నౌకా నిర్మాణం,

---

## అసెంబ్లీ ఎలక్షనులకు రూ. 150 కోట్ల ఖర్చు!

భారతదేశం 11 రాష్ట్రాలలోను, కేంద్ర పాలితమైన పాండిచ్చేరిలోను 1985 వ సం.లో ఎలక్షనులకు మొత్తం రూ. 150 కోట్లపైబడి ఖర్చయింది. 1984 సం. లో లోక్‌సభ ఎలక్షనులకు అయిన ఖర్చు సుమారు రూ. 100 కోట్లు.

"దుఃఖములోనే ధర్మము పరీక్షింపబడును."

(డి) ట్రాన్స్‌పోర్టు.

3. రాజస్థాన్‌లో అణు విస్ఫోటనము ఎప్పుడు జరిగింది?

(ఏ) 1971, (బి) 1974, (సి) 1978, (డి) 1979.

4. 'కవర్‌పాయింట్' అనే మాట ఏ క్రీడకు సంబంధించినది?

(ఎ) హాకీ, (బి) క్రికెట్, (సి) ఫుట్ బాల్, (డి) బిలియర్డ్స్.

5. 'వేయిపడగలు' నవల వ్రాసినదెవరు?

6 బ్రెజిల్ ముఖ్యభాష ఏది?

(ఎ) ఇంగ్లీష్, (బి) స్పానిష్, (సి) పోర్చుగీసు, (డి) ఫ్రెంచి.

7. జూలై 21, 1969 లో మొట్టమొదట చంద్రగ్రహంమీద కాలుమోపిన వ్యక్తి ఎవరు?

(ఎ) ఎడ్విన్ ఆల్‌డ్రిన్, (బి) నెయిల్ ఆర్మ్‌స్ట్రాంగ్, (సి) అలాన్‌బీన్, (డి) రిచర్డ్ గార్డాన్.

8. ఈ క్రింది వాటిలో జవహర్‌లాల్ నెహ్రూ రచించిన గ్రంథమేది?

(ఎ) మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్, (బి) ఇండియా విన్స్ ఫ్రీడం, (సి) డిస్కవరీ ఆఫ్ ఇండియా, (డి) ది నేషన్స్ వాయిస్.

# పజిల్

ఆధారాలు - అడ్డం: 1. దేశభాష లందు లెస్స, 3. రహస్యముగా మాట్లాడు కొనునప్పుడు కలుగు ధ్వనులు, 6. లెక్క పెట్టుట అనే మాటలో రెండవ అక్షరం మొదట వ్రాస్తే, 7. వావిన వృత్తితో జీవించే వారు, 8 ఒక వస్తువును గాని, పనిని గాని చేయు విధానము, 9. పీడ చెట్టును చెరచు నట్లు, కుచ్చితుడు మంచివానిని చెరచునట్లు వృక్షాన్ని చెరచేది, 10. ఇటువంటి జామ కాయలు వగరుగా ఉంటాయి. 11. పాపము కాదు అనే మాటలో మొదటి రెండు అక్షరాలలో ఈవలది ఆవల, ఆవలది ఈవల అయ ది, 12. బలరాముని ఆయుధ విశేషం, 14. స్త్రీలు ధరించెడి ఆభరణ విశేషం. 15. తెలుగు వ్యాకరణంలో ప్రథమా విభక్తి ప్రత్యయాలు.

నిలువు: 1. తమిళుల దాహం తీర్చడానికి ఆంధ్రప్రభుత్వం చేపట్టిన ఒక ఏర్పాటు,



2. చూడడానికి అన్నీ ఒకేరీతిగా ఉన్నా రుములు వేరై నట్లే, మానవజాతి అంతా ఒకచే అయినా ఇవి ఒకే రీతిగా ఉండవు, 3. గడ్డపారయొక్క అనే మొదటి మాటలతో చేతి

దుఃఖకరమైన బాధ అనే పదంలో రెండవ మాట తలక్రిందులైంది, 4. హెచ్చవేయబడినది అనే అర్థమిచ్చే మాటతో ప్రశస్త గుణములు కలది అనే మాట చేరినది, 5. లోపించిన దానితో చేరిన "చలించినది" అనే రెండవ మాట క్రిందనుంచి పైకి, 12. బాలకృష్ణుని వాద్యవిశేషము, 13. శ్రీ రామచంద్రుని పుత్రులలో ఒకరు.

**విసదమ్**
**పోటీల కూపను**
**నవంబరు 1985**

8. ప్రపంచం అంతటా ప్రయాణం చేస్తుంది కాని ఒకమూల కూర్చుని ఉంటుంది. అది ఏది?

## తెలివికి పరీక్ష

1. 1,3,4,6,7,9 — ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది?

2. 'ధ్యాంముఅతదిమనా' అనే మాటలో అక్షరాలను సరిగా వ్రాసి పరమాత్మను కనుగొనండి.

3. క్రింది వాటిలో ఇముడనిది ఏది? 'టెలిఫోను', 'టెలివిజన్', 'టెలిగ్రాపు', 'టెలిస్కోపు', 'టెలిగ్రామ్'.

4. ఆంధ్రప్రదేశ్ లో మాట్లాడుకునే భాష 'తెలుగు'కు ఆ పేరు ఎలా సార్థకమైంది?

5. తెలుగునకు వర్ణములు (అక్షరములు) ఎన్ని? అవి ఏవి?

6. భారతమాత దాస్య విమోచనానికి, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమునకు అమరణము కృషిచేసిన శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య స్థాపించిన సంఘమేది?

7. 'చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు', 'నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు' అనే చాటువు ఎవరు దేనిమీద రచించారు?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి.

1. కుతపము: (ఎ) రవిక, (బి) వాద్యం, (సి) కంబళి, (డి) దర్భ.

2. చెలువు: (ఎ) అందము, (బి) విధము, (సి) స్నేహం, (డి) గుడ్డ.

3. సంగడము: (ఎ) జగడం, (బి) విడియం, (సి) స్నేహం, (డి) సహాయం.

4. మిడుకు: (ఎ) జీవం, (బి) ఒక రకం కీటకం, (సి) సంచరించు, (డి) కిరణం.

5. విశాకు: (ఎ) పరధ్యానం, (బి) పరవశత్వము, (సి) విశ్వేష్టత, (డి) పరిమళం.

6. మహంగము: (ఎ) ఏనుగు, (బి) ఒంటె, (సి) ఔషధం, (డి) ఢమరుకము.

7. ఎంటెన్న: (ఎ) నిరక్షర కుక్షి, (బి) అసమర్థుడు, (సి) సమర్థుడు, (డి) గౌరవముగల

'దానం చేశామని గుర్తుంచుకోవడంకంటె అసలు మానేస్తే మంచిది.'

# పోటీలు (ఫలితాలు)

(సెప్టెంబరు 1985)

వ్యాసం: విజేతలు: మొదటి బహుమతి: కె. నాగలక్ష్మి, ఇచ్ఛాపురం, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: వి. జీవరాజు, చిలకలపూడి పోస్టు, (కృష్ణా జిల్లా); మూడవ బహుమతి: ఎస్. మధుసూధనరావు, వసుంధర పోస్టు, (శ్రీకాకుళం జిల్లా)

క్విజ్—జవాబులు: 1. అంటార్కిటికాలో భారతీయ స్థావరం, 2. కాంచనగంగ, 3. అంటీ బయోటిక్కులు, 4. జంతు సంబంధమైన క్రొవ్వు, 5. డా. రాజా రామన్న, 6. అబ్రహాం లింకన్, 7. తారాపూర్, 8. ఉపాధ్యాయుడు.

విజేతలు: మొదటి బహుమతి. ఏ. మాధవీలత, కదిరి, (అనంతపురం జిల్లా); రెండవ బహుమతి: బి. కేశవరావు, తడ, (నెల్లూరు జిల్లా); మూడవ బహుమతి: జె. మాధవి ధరణి, గాజువాక, విశాఖపట్నం.

పజిల్ - జవాబులు - అడ్డం: 1. రామదాసు, 3. భద్రగిరి, 5 శకటము, 6. భారతము, 8. కాలువ, 9. వడియము, 10. నియబు విముమ, 13 నాకి, 15. నుడువరి, 17. కాక, 18. వర్తమానము.

నిలువు: 1. రాకాశశివదనా, 2. సుమము కాముని లవ, 3. భక్తి భావములు, 4. రికము, 7. తగరము, 11 విమునమూ, 12. మననము, 14. కినుక, 16. రివ.

విజేతలు: మొదటి బహుమతి: చంద్రిక, గుడ్లవల్లేరు; రెండవ బహుమతి: ఎమ్.ఎస్.

---

## ముఖచిత్రవ్యాఖ్య

(సెప్టెంబరు 1985)

"అందానికే అందం
అభినయ సుందరి ముఖారవిందం."

—ఎస్. మురళీమోహన్, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా)

* * *

"నాట్యంలో మయూరి
'విస్‌డమ్'పై వయ్యారి."

—ఏడిద బాలగోపాల్, పెదపట్నం, (తూ.గో. జిల్లా)

* * *

"నీ కాటుక కన్నుల అందం
మా పాఠకులకే ఆనందం."

—ఎన్. మల్లేశ్వరరావు, చాపార, (శ్రీకాకుళం జిల్లా)

"రాజ్యమున ఐకమత్యం లోపించిన రాజ్యం నిలువదు;
ఇంట ఐకమత్యం లోపించిన ఇల్లు నిలువదు."

# పోటీలు (ఫలితాలు)

(సెప్టెంబరు 1985)

వ్యాసం: విజేతలు: మొదటి బహుమతి: కె. నాగలక్ష్మి, ఇచ్ఛాపురం, (శ్రీకాకుళం జిల్లా): రెండవ బహుమతి: వి. జీవరాజు, చిలకలపూడి పోస్టు, (కృష్ణా జిల్లా): మూడవ బహుమతి: ఎస్.మధుసూధనరావు, వసుంధర పోస్టు. (శ్రీకాకుళం జిల్లా)

క్విజ్—జవాబులు: 1. అంటార్కిటికాలో భారతీయ స్థావరం, 2. కాంచనగంగ, 3. అంటీ బయోటిక్కులు, 4. జంతు సంబంధమైన క్రొవ్వు, 5. డా. రాజా రామన్న, 6. అబ్రహాం లింకన్, 7. తారాపూర్, 8. ఉపాధ్యక్షుడు.

విజేతలు: మొదటి బహుమతి. ఏ. మాధవీలత, కదిరి, (అనంతపురం జిల్లా): రెండవ బహుమతి: బి. కేశవరావు, తడ, (నెల్లూరు జిల్లా): మూడవ బహుమతి: జె. మాధవి ధరణి, గాజువాక, విశాఖపట్నం.

పజిల్ - జవాబులు - అడ్డం: 1. రామదాసు, 3. భద్రగిరి, 5 శకటము, 6. భారతము, 8. కాలువ, 9. వడియము, 10. నియబు విముమ, 13 నాకి, 15. నుదువరి, 17. కాక, 18. వర్తమానము.

నిలువు: 1. రాకాశశివదనా, 2. సుమము కాముని లవ, 3. భక్తి భావములు, 4. రికము. 7. తగరము, 11 విమునమా, 12. మననము, 14. కినుక, 16. రివ.

విజేతలు: మొదటి బహుమతి: చంద్రిక, గుడ్లవల్లేరు: రెండవ బహుమతి: ఎమ్.ఎస్.

---

## ముఖచిత్ర వ్యాఖ్య

(సెప్టెంబరు 1985)

"అందానికే అందం
అభినయ సుందరి ముఖార విందం."

—ఎస్. మురళీమోహన్, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా)

* * *

"నాట్యంలో మయూరి
'విన్‌డమ్'పై వయ్యారి."

—ఏదిద బాలగోపాల్, పెదపట్నం, (తూ.గో. జిల్లా)

* * *

"నీ కాటుక కన్నుల అందం
మా పాఠకులకే ఆనందం."

—ఎన్. మల్లేశ్వరరావు, బాపార, (శ్రీకాకుళం జిల్లా)

"రాజ్యమున ఐకమత్యం లోపించిన రాజ్యం నిలువదు;
ఇంట ఐకమత్యం లోపించిన ఇల్లు నిలువదు."

ఎన్. మూర్తి, జిల్లెళ్ళమూడి, (గుంటూరు జిల్లా); మూడవ బహుమతి: జె. శ్యామలా రామ్, హైదరాబాద్.

**తెలివికి పరీక్ష:** జవాబులు: 1. 88, 2. 125. 3. 60 రోజులలో, 4. ఏ ఎండ కాగొడుగు, 5. అగస్త్య భ్రాత, 6. తూణీరము, 7. స్థానం నరసింహారావు, 8. త్యాగరాజు.

**విజేతలు**: మొదటి బహుమతి: కె బి. ఎస్. లక్ష్మి, విజయవాడ; రెండవ బహుమతి: టి ఎస్. వనజాక్షి. కోవూర్ నగర్, (అనంతపురం జిల్లా); మూడవ బహుమతి: జలుసు రాధాకుమారి, వెంకట్రాయపురం, (ప.గో జిల్లా.)

**మాటల మహిమ - జవాబులు:** 1. బ్రాహ్మణుడు (బి), సన్యాసి (సి); 2. సహాయం (సి) 3. రోగము లేనిది (ఎ), పీ రోగము(సి), 4. పూనిక(ఎ), లాభము(బి), 5. విభూది (సి), 6. అదృష్టము (ఎ), సుకృతము (సి), 7. సంతాపం (ఎ), బాధ (బి), ఏడుపు (సి), 8. మిక్కిలి ఇచ్చువాడు (ఎ), మనోజ్ఞముగా మాటలాడు (బి).

**విజేతలు:** మొదటి బహుమతి: అయ్యగారి రవిశంకర్, హైద్రాబాదు; రెండవ బహుమతి: ఎమ్. శ్రీదేవి, బాపట్ల; మూడవ బహుమతి: ఎమ్. పవన్‌కుమార్, కైకలూరు, (కృష్ణా జిల్లా)

**ముఖచిత్రవ్యాఖ్య:** మొదటిబహుమతి: ఎన్. మురళీ మోహన్, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: ఏడిద బాలగోపాల్, పెదపట్నం, (తూ.గో. జిల్లా); మూడవ బహుమతి: ఎన్. మల్లేశ్వరరావు, బాపార, (శ్రీకాకుళం జిల్లా)

**పాఠకుల అభిప్రాయాలు:** మొదటి బహుమతి: గుడ్ల సంజీవరావు, కళ్యాణ సింగుపురం (కోరాపుట్ జిల్లా); రెండవ బహుమతి: టి. బాలకిషన్, లింగగిరి, (నల్గొండ జిల్లా); మూడవ బహుమతి: ఏడిద బాలగోపాల్, పెదపట్నం, (తూ.గో.జిల్లా)

**మీరైతే**-మొదటి బహుమతి డి చలపతిరావు, రంగశాయిపేట, (వరంగల్ జిల్లా); రెండవ బహుమతి: ఏ. గీతాంజలి, మచిలీపట్నం; మూడవ బహుమతి: భమిడిపాటి పద్మజ, నరసన్నపేట (శ్రీకాకుళం జిల్లా)

**భావపరిచయ పోటీ:** మొదటి బహుమతి. ఆర్ పురుషోత్తం, కలకోట, (ఖమ్మం జిల్లా); రెండవ బహుమతి: బి జనార్దనరావు, అమలాపురం; మూడవ బహుమతి: శ్రీమతి శారదా మోహన్, కాకినాడ.

---

## ప్రతి ఆలోచన ప్రతి క్రియ భావి జీవితాన్ని తీర్చిదిద్దుతుంది

మీ భావి జీవితాన్ని తీర్చి దిద్దేది మీరు చేసే యోచన, మీరుచేసే పని. దురాలోచనలు, దుష్కర్మలు పెద్ద పులుల లాగా మీదకు దుముకుతాయి. సద్వచనాలు, సత్కర్మలు దేవతా సమూహంలో మీకు సంరక్షను కలిగిస్తాయి.

—స్వామి వివేకానంద.

"నీవు చేయు దానము గుప్తముగా జరుగనీ;
కుడిచేయిచేసిన దానిని ఎడమచేతికి తెలియ నీయకు."